# తెలుగు స్వతంత్ర

సంపుటి-4
సంచిక-18

నవంబరు 30, 1951

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## కాకి బంగారం: చిలక పలుకులు

పండిత నెహ్రూ మద్రాసు బహిరంగ సభలో ప్రసంగిస్తూ "వ్యక్తిని చూసి గాక పార్టీని చూసి మీ ఓటును సద్వినియోగం చేసుకోండి" అని హితోపదేశం చేశారు. అందుకు కారణాలు వివరిస్తూ "వ్యక్తి ఎంత సమర్థుడూ, వివేకవంతుడైనా ఒక పార్టీ అంత శక్తిమంతుడు కాజాలడు. దేశాన్ని వేధించే సమస్యలను అతడొక్కడే పరిష్కరించలేడు" అన్నారు. ఇదే అభిప్రాయాలను మొన్న కళా వెంకట్రావు గారు, గోపాలరెడ్డిగారు ఇంకా మిగిలిన నాయకులు ప్రజలకు నూరిపోస్తున్నారు. ఇది నిజమైన అర్థంలోని ప్రజాస్వామ్యానికి గొడ్డలిపెట్టు. అప్పుడు "ప్రజాస్వామ్యం" స్థానాన్ని "పార్టీ స్వామ్యం" ఆక్రమిస్తుంది.

అయితే కాంగ్రెసువాళ్ళు ఇలా కాక ఈ రోజుల్లో మరింకెలా చెప్తారు? కాంగ్రెసుకు చెందిన చాలా మంది వ్యక్తుల్లో అవినీతి అనేది అతి సాధారణ విషయం అయింది. అలాంటప్పుడు వ్యక్తిని చూచి ఓటు వేయమనడం చాలా ఓట్లను పోగొట్టుకోవడమే అవుతుంది. ఈ విషయం అందరికీ తెలుసు. కనుకనే వ్యక్తులను ఎన్నుకోవడంలో యోగ్యత, సామర్థ్యాలను ముఖ్యంగా పరిగణించమని తమ శాఖలకు సం జారీచేసిన కాంగ్రెసు అధ్యక్షుడు వేరే విధంగా ఉద్బోధిస్తున్నారు.

పై అభిప్రాయం ప్రకారం ఎన్నికల్లో పార్టీలే లెక్కకు వచ్చేయెడల, ప్రతినిధుల మంచి చెడుగుల విచక్షణ చేయవలసిన ఆవశ్యకత ఏముంది? ఈ విధముగా చేయడం ప్రజ వ్యతిరేకిస్తుంది అని వారికి తెలుసు. అందుకనే అలా చెయ్యలేదు. ఒక నియోజక వర్గంలో ఏ ప్రజాభిమానాన్ని పొందిన వ్యక్తో ఒక కాంగ్రెసేతర పార్టీ అభ్యర్థి అయి, అతని ప్రతికక్షిగా కాంగ్రెసు టిక్కెట్టు మీద ఒక "గజదొంగ" నిలబడితే, అప్పుడు ప్రజలు నెహ్రూ మాటలు శిరసావహించే యెడల ఆ "గజదొంగ"కే ఓటు వేయాలి. ఇది సమర్థనీయమా?

ఈ సందర్భంలో ఒక ప్రశ్న ఉదయించవచ్చు. వ్యక్తే ప్రధానమై పార్టీ ప్రమేయమే లేకపోతే మరి పార్టీలనెందుకు సృష్టించుతున్నారు?-అని. ఎన్నికల ప్రణాళికలంటూ ఎందుకేర్పడ్డాయి? ప్రచారానికి పార్టీలెందుకు పూనుకుంటున్నాయి? నిజానికి పార్టీలనేవి కొందరు వ్యక్తుల సముదాయాలు. ఆయా పార్టీలలోని వారందరూ ఏకాభిప్రాయానికి వచ్చి, ఒకరి కొకరు అండగా సంఘటిత

శక్తిని సంపాదించుకొని ఆయా ప్రణాళికలతో ప్రజల ముందుకు వస్తారు. ఇది అర్థం చేసుకుంటే ఆ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. అంతేకాని మనిషికొక ప్రణాళికతో ముందుకొస్తే హాస్యాస్పదంగానూ, ప్రజలకు శిరోవేదనగా కూడా వుంటుంది. అందుకనే సామాన్యాభిప్రాయాలను సంక్షిప్తంచేసి ప్రణాళిక అని నామకరణం చేసి ప్రజలముందు పారేస్తున్నారు. పర్యవసానంగా పార్టీలు తమ సభ్యుల అభిప్రాయాలను వ్యక్తం చేయడమేగాక సమానస్థాయిలో ఉంచి వ్యక్తులు పెడత్రోవను పడకుండా హద్దులుకూడా నిర్ణయిస్తున్నాయి. కనుక ఇక్కడకూడా వ్యక్తికే ప్రాధాన్యం వహిస్తాడు. మన ఓటు ఆ సంఘటిత అభిప్రాయానికి.

పార్టీ ప్రధానంగా ఎన్నుకోబడంవలన అనేక ఇతర నష్టాలుకూడా ఉన్నాయి. అభ్యర్థి పార్టీకే బద్ధుడవుతున్నాడుగాని నియోజకవర్గమునకు కాదు. ఇది ప్రజలు కోరరు. అతడు పార్టీ ప్రతినిధిగా గాక, తమ ప్రతినిధిగా మాత్రమే ఎన్నుకొనబడుతున్నాడు కాబట్టి తమకే బద్ధుడై ఉండాలి.

కాంగ్రెసు ప్రచారంలో ప్రాముఖ్యం వహిస్తున్నది వారి గత చరిత్ర. అంటే గత ఐదుసంవత్సరాలది. ఇక్కడ ప్రజ లొకవిషయం గమనించాలి. "కాంగ్రెసు" పేరుతో వెనకటిరోజుల్లో ప్రజాభిమానాన్ని చూరగొన్నది ఒక పార్టీ కాదు. ఒక మహోద్యమం, భారతదేశపు నలుమూలల వారినీ కూడగట్టుకొని "స్వతంత్రం స్వతంత్రం" అని తపించిపోయిన ఒక సర్వజన సంస్థ. అందులో మన ప్రియతము లందరూ ఉన్నారు. కాని నేటి కాంగ్రెస్ అది కాదు. ఇది కేవలము సమాజంలో ఒక వర్గానికే చెందిన ఒక పార్టీ. నేడందులో అందరికీ తావులేదు. ఆ మహాసభ ఏనాడు పార్టీగా మారిందో చెప్పలేము. కాని నాడది ఒక సర్వజనీన సంస్థ. నేడది ఒక పార్టీ. స్వతంత్రావతరతో ఆ సంస్థ అంతరించింది.

కాంగ్రెసు పేరుతో చెలామణీ అవుతున్నది వేరొకపార్టీ. దీని వయస్సు నాలుగు సంవత్సరాలు. గాంధీజీ దీని నాయకుడంటే అసత్యం. కాంగ్రెసు పేరుతో నెగ్గలేని ఈ "ముఠా" వారు ఆ పేరును తమహక్కు భుక్తంగా గుత్తకు తీసికొని ఆ "గుడ్ విల్"ను అనుభవింప చూస్తున్నారు. నిజానికి ఆనాటి కీర్తి ప్రతిష్ఠలన్నీ కేవలం వీరి కారణంగానే కాంగ్రెసుకి సంప్రాప్తించాయా?

మొత్తంమీద ఓట్లు "మెరిసేవన్నీ బంగారా"లని మోసపోకుండా ఆయా పార్టీలను పూర్తిగా అర్థం చేసికొని మరీ సంచరించాలి. కాంగ్రెసు విషయంలో అదనంగా దాని నాలుగేళ్ళ ప్రభుత్వ విధానాలను, అది "కష్టకాలం కష్టకాలం" అంటూ ప్రజలను మభ్యపెట్టి దేశపరిస్థితినినానాటికి నైతికంగా, ఆర్థికంగా సర్వవిధాలా అధోగతికి తెచ్చిన సత్యాలను ఒకమారు జ్ఞప్తికి తెచ్చుకొని మరీ ఓటు వేయడం భావ్యం.

---

**మన నిస్సహాయతను సమర్థించుకొంటూ పరిస్థితులను నిందించడం మన ముఖం వికృతంగా ఉంటే అద్దాన్ని నిందించడం వంటిది.**

# రాగం తానం పల్లవి

ఉషశ్రీ

ఎన్నికల యాత్రా స్పెషల్ కూతవేసింది. కాంగ్రెసు పరిపాలన పుణ్యమా అంటూ రైళ్లలో సగం మందికి పైగా టిక్కెట్లు లేకుండా స్వేచ్ఛగా ప్రయాణం చేస్తున్నట్లే ఎన్నికలలో కూడా దాదాపు సగం మంది అభ్యర్థులు ఏ టిక్కెట్టూ లేకుండా స్వతంత్రు లుగా రైలెక్కుతున్నారు. కొన్ని పార్టీల టిక్కెట్లు ప్లాటుఫారం టిక్కెట్లకంటె కూడా చవకగా దొరుకుతున్నప్పటికీ ఆంధ్ర దేశంలో 350 మంది ఆ జోలికి పోదలచలేదు. అన్నయుం అర్థించకుండానే, వారి అనుమతి లేకుండానే ప్రకాశంగారు కొందరికి కాంప్లిమెంటరీ టిక్కెట్లు పంపిస్తే, వద్దని తిరస్కరిస్తూ ప్రకటనలు కూడా చేశారు. కాంగ్రెసు తరువాత ఎక్కువ స్థానాలకు పేర్లు ప్రకటించిన ఘనత కావాలనే తప్ప ఎన్ని గెలుస్తామనే చూపు లేనప్పుడు చిల్లర దుకాణంలాగా కనపడినవారి కల్లా టిక్కెట్లు ఇవ్వటం కష్టమైన పని కాదు. కొన్ని స్టేషన్లలో టిక్కెట్లు ఇంత సులువుగా దొరుకుతున్నా కూడా ఆంధ్రా ప్రంట్ అనీ, దేవుని పార్టీ అనీ కొందరు సొంత పార్టీలను కంటున్నారు. సినిమాల పేర్ల మాదిరిగా రోజు రోజుకు వింత వింతయిన పార్టీ పేర్లు వినబడు తున్నవి. దేవుడు లేడని వాదించే గోపరాజు రామచంద్రరావుగారు బెజవాడ పార్లమెంటు సీటుకు పోటీ చేస్తున్న కారణంగా దేవుడు ఉన్నాడని రుజువు చెయ్యాలన్న సంకల్పంతో ఒక భక్తుడు "దేవుని పార్టీ" పేరుమీద నిలబడటం తగినట్లే ఉన్నది. ఆపద సమయంలో దేవుని స్మరించటం సహజమే కదా! జస్టిస్ పార్టీ పాత కాపులు కొందరు వారు వీరు ఎక్కే పెట్టెలలో ఎక్కటం తమ దర్పానికి లోటన్న భావంతో యాత్రా స్పెషల్‌కు స్పెషల్ పెట్టెలు తగిలించుకుంటున్నారు. ఈ ఎన్నికల యాత్రికులలో చివరవరకు ప్రయాణం చేసేది ఎంతమందో కాని ఇప్పుడుమాత్రం రైలు కిట కిట లాడిపోతున్నది.

ప్రతి సీటుకు కనీసం ఏడెనిమిది మంది నామినేషన్లు వేశారు. ఆంధ్ర కాంగ్రెసు అభ్యర్థుల జాబితా ప్రసవవేదననుండి బైటపడిన నాటి నుండి, నేనూ నిలబడతానని అనని వాడు వెర్రి వాడు! అక్కడ ఆయన నిలబడుతున్నాడు, ఇక్కడ ఈయన నిలబడుతున్నాడు. ఎక్కడ పడినా ఇవే మాటలు. అలా చూస్తే ఈ నెలంతా నిలబడతామనేవారే తప్ప కూర్చుంటా మనేవారు ఒక్కరూ కనబడటంలేదు. ఆంధ్ర కాంగ్రెసు అభ్యర్థులలో చాలమంది "జగమెరిగిన బ్రాహ్మణులు" కనుక వారిమీద పోటీ కంటే ప్రతివారూ వొంటి కాలుమీద లేస్తున్నారు. పైగా ఒక్కొక్క సీటుకు ఏడెనిమిదిమంది కావటంతో కులం పేరుతోనో, పార్టీ పేరుతోనో ఎవరికివారు తమకే ఛాన్సని లొట్టలు వేసుకొంటున్నారు. అర్రులు కడిగిన వారుకూడా తిరిగి రంకెలు వేయటానికి ఈ వాతావరణమే కారణం. అదీ కాక గత నాలుగేండ్ల అనుభవాన్ని బట్టి ఎం. ఎల్. ఏ. పదవికి మునుపెన్నడూ లేని ప్రత్యేకత కనబడుతున్నది. దీనికి మించిన లాభసాటి పెట్టుబడి మరేదీ కనబడటంలేదు. ఒడుదుడుకులు లేకుండా కడుపులో చల్ల కదలకుండా ఒకటికి

అన్ని రెట్లు ఆర్జించగల సాధనం దీనికి మించి మరొకటి లేదన్న భావం ప్రచారంలో ఉన్నది. కూర్చుని లేవలేనివారు చిటికెలో కుబేరులై పోవటం చూస్తుంటే ప్రతివారికీ పెరపెర పుడుతున్నది. గారడీవాడు మన కండ్ల యెదుట రూపాయలు చేసి గుమ్మరించినట్లే ఎం.ఎల్.ఏలు నిముషాలమీద మేడలు సృష్టించగలుగుతున్నారు. పైపెచ్చు మంత్రి వర్గీయులైన ఎం.ఎల్.ఏ. ఎరుకలేనిదే ఆ ప్రాంతంలో ఆకు కూడా అల్లల్లాడడానికి వీలులేదు. కనుక పనులున్నవారు అరచేతులమీద నడిపించి వారికి లిస్తుండిరి. తమ అనుయాయులైన ఎం.ఎల్.ఎ. అందరికీ వారి వారి పరగణాలను మంత్రివర్గంవారు ఉచితంగా ఇజారా కివ్వటంతో ఎం. ఎల్. ఎ వ్యాపారం భూతల స్వర్గంగా కనపడుతున్నది. అందువల్ల ఎం. ఎల్. ఎ పదవి ఈనాటి కనీసపు కోర్కె!

అన్ని స్థానాలకూ పోటీ చేస్తున్నది ఒక్క కాంగ్రెసు మాత్రమేనని, ఇతర పార్టీ టిక్కెట్లతో పోటీ చేస్తున్నవారిలో కొందరు కాంగ్రెసు టిక్కెట్టుకొరకు ప్రయత్నించినవారేనని అందువల్ల కాంగ్రెసుకున్న విలువ మరే యితర పార్టీకి లేదని కాంగ్రెసు వాదులు ప్రచారం చేసుకుంటున్నారు. అన్ని స్థానాలకూ తమ అభ్యర్థులను నిలబెట్టటం కాదు అసలు విషయం; ఎన్ని స్థానాలకు తమకు పోటీ లేదన్నది. కాంగ్రెసు టిక్కెట్లు చిక్కకపోయినమీదటనే ఇతర పార్టీ టిక్కెట్లు పుచ్చుకొంటున్నారనటం కూడా వాదనకు నిలిచే విషయం కాదు. ఎందుకంటే, కాంగ్రెసు టిక్కెట్లు దొరికి కూడా వద్దని తిరస్కరించి మరొక పార్టీ పేరుతోనో లేక స్వతంత్రులుగానో పోటీ చేస్తున్నవారెందరో ఉన్నారు. కాంగ్రెసుపార్టీ నియమాలు తేలకముందే తమ దరఖాస్తులను ఉపసంహరించుకున్నవారు కూడా యెందరో ఉన్నారు. దివి నియోజక వర్గానికి కాంగ్రెసు అభ్యర్థిత్వం కొరకు దరఖాస్తు పెట్టుకున్న చల్లపల్లి రాజాగారు, రాష్ట్రసంఘ నిర్ణయం బైటకు రాకపూర్వమే తన దరఖాస్తును విరమించుకుంటూ "నా నియోజక వర్గంలోని వోటర్లు కాంగ్రెసు అభ్యర్థిగా కాకుండా స్వతంత్రంగానే నన్ను పోటీ చేయమని కోరటంవల్ల నేనీ నిర్ణయానికి వచ్చాను" అంటూ ఒక ప్రకటన చేశారు. ఒంగోలు రిజర్వు స్థానానికి కాంగ్రెసు అభ్యర్థిత్వం కొరకు కేంద్ర సంఘం వరకు అప్పీలుకు వెళ్ళిన సునందమ్మగారు, కేంద్రసంఘం నిర్ణయించక ముందే "ఈ నియోజక వర్గంలో కాంగ్రెసు విజయం పొందే అవకాశం లేనందున నా అభ్యర్థిత్వాన్ని విరమించుకుంటున్నాన"ని ప్రకటించారు. చీరాల సీటుకు కాంగ్రెసు అభ్యర్థిగా కేంద్ర సంఘంచే అప్పీలులో నిర్ణయించబడిన బెంజమన్ గారు కాంగ్రెసు పేరుమీద నిలబడటం నష్టదాయకమని గమనించి స్వతంత్ర అభ్యర్థిగా నిలబడుతున్నారు. కాశీశ్వరరావు గారికి జగ్గయ్యపేట సీటు ఇచ్చినప్పటికీ కాంగ్రెసు అవతారం చాలించటానికే నిశ్చయించుకొన్నారు. గిరి గారు, వారి వియ్యంకుడు వెన్నెలకంటి రాఘవయ్యగారు కూడా మొదట యిచ్చిన స్థానాలనుండి స్థానభ్రంశం కావలసి వచ్చింది. వీటన్నిటినిబట్టి చూస్తే ప్రజాభిప్రాయాన్ని గమనించకుండా ముందు కాంగ్రెసు టిక్కెట్ల కొరకు అర్జీలు పెట్టుకున్న పెద్దలే, ఆయా నియోజక వర్గాలలో పర్యటించి వాతావరణాన్ని గుర్తించిన పిమ్మట కాంగ్రెసు పేరు చెప్పుకోవటం వల్ల వచ్చే వోట్లు కూడా రాకుండా చేసుకోవటమేనని గ్రహించిన ఫలితంగానే కాంగ్రెసు జండాలు త్రెంచి పారవేస్తున్నారని తేలుతుంది.

కాంగ్రెసు నిలబెట్టిన అభ్యర్థులలో చెడ్డవారు కొందరున్నమాట వాస్తవమేనని నెహ్రూ అంగీకరిస్తున్నాడు. ప్రజల సానుభూతిని సంపాదించే విధానాలలో తప్పును ఒప్పుకోవటం ఒకటి. గాంధీజీ నేర్పిన ఈపాఠాన్ని నెహ్రూ ఇప్పుడు అప్పగిస్తున్నాడు. తామవలంబించిన హింసా విధానం తప్పేనని కమ్యూనిస్టులు అంగీకరించటం కూడా ప్రజలకు తమమీద ప్రబలిపోయిన ద్వేషభావాన్ని విరగదీయటానికే. ఎన్నికలకు అభ్యర్థులను నిర్ణయించటం, కాంగ్రెసును సంస్కరించటం రెండూ ఒకేసారి చేయలేడట. అందువల్ల ఎన్నికల అనంతరం కాంగ్రెసునుండి అనర్హులను తొలగిస్తా

వని, నెహ్రూ చెబుతున్నాడు. ప్రథమశ్రేణికి చెందిన అభ్యర్థులనే కాంగ్రెసు నిలబెడుతుందని చెప్పిన నెహ్రూ మాటలకు ఇక ఎవరు భ్రమించిపోతారు? ప్రధాని, కాంగ్రెసు అధ్యక్ష పదవులు రెండూ ఒకే సమయంలో నిర్వహించగల వ్యక్తి కాంగ్రెసు అధ్యక్షుల నిర్ణయంలో పాటే కాంగ్రెసునుకూడా సొంతుకు లోప రహితం చేయలేడో? ఇప్పుడు చెయ్యలేని ప[...] ముందుమాత్రం ఎలా చెయగలడో? కాంగ్[...]సులో ఎలాంటివారున్నారనేది ఆ పార్టీకి సంబంధించిన వ్యవహారం. కాని కాంగ్రెసు అభ్యర్థు లెలాంటి వారనేది ప్రజలకు కావలసిన సమస్య. అందువల్ల కాంగ్రెసును ముందెప్పుడో పునీతం చేస్తానని చెప్పటంద్వారా కాంగ్రెసు ప్రస్తుతం నిలబెడుతున్న అభ్యర్థులను గురించిన అసంతృప్తిని సర్దుబాటు చేయాలని నెహ్రూ చేస్తున్న ప్రయత్నంలో అర్థంలేదు. ఒకవైపు తమ అభ్యర్థులలో దుష్టులుకూడా ఉన్నారని ఒప్పుకుంటూనే, వ్యక్తిదూషణ కూడదని ప్రణాలికలమీద, విధానాలమీదనే ఒకరినొకరు విమర్శించుకోవాలని నెహ్రూ సలహా లిస్తున్నాడు. ఏవ్యక్తినీ అన్యాయంగా దూషించ కూడదు. కాని ప్రజాప్రతినిధిగా చలామణి అయ్యే వ్యక్తి తెరవెనుక ఆడే భాగవతము, ఆయనచేసే లాలూచీ వ్యవహారాలు బైట పెట్టటం వ్యక్తిగత దూషణ అవుతుందా? ప్రతి అభ్యర్థి చరిత్రను ప్రజలు సాకల్యంగా తెలుసుకోవాలి. పార్టీ లెలాఉన్నా, వ్యక్తులు నిజాయితీపరులు కావటం ముందు అవసరం. అందువల్ల అభ్యర్థులు చేసిన తప్పులను బైట పెట్టటం వ్యక్తిదూషణ కాకపోగా పైగా అత్యవసరమైన చర్య. ఇతర పార్టీల అభ్యర్థులకంటె కాంగ్రెసు అభ్యర్థులలో చెడ్డవారు హెచ్చుమంది ఉండటంవల్లనే వారి లోపాలను ఏకరువు పెట్టటం తమకు నష్టదాయకమన్న బెరుకుతో వ్యక్తి దూషణ తగదని సలహా లిస్తున్నారు. జేబుదొంగను పట్టుకొని తన్నబోతుంటే పాపం ఊరుకోమని జాలి తలిచే దేశం మనది. అందుకే ప్రజాప్రతినిధులుచేసిన అవకతవకపనులను బైట పెట్టటంకూడా వ్యక్తిదూషణగా వ్యాఖ్యానిస్తారు కొందరు. కాని ఎం. ఎల్. ఏ. బిరుదు ద్వారా ఒక వెలుగు వెలగాలని చూచే పెద్దల పుట్టుపూర్వోత్తరాలు పూర్తిగా బహిర్గతం కావటం యెంతైనా అవసరం.



మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ ప్రిన్సిపాల్ శ్రీ దేవీప్రసాద్ రాయ్‌చౌదరిని చైనానుండి యిటీవల వచ్చిన కల్చరల్ డెలిగేషన్ సభ్యులు కలుసుకున్నప్పుడు తీసిన ఛాయాచిత్రం.

# కాంగ్రెసుకే నా వోటు

"వోటరు"

ఎన్నికలు దగ్గిర పడుతున్న కొద్దీ ఎక్కడికి వెళ్ళినా ఎన్నికలను గురించీ, ఎన్నికల్లో పోటీచేసే పార్టీలను గురించీ, పార్టీలు నిలబెట్టే అభ్యర్థులను గురించీ, అభ్యర్థుల మంచిచెడ్డలను నిర్ణయించటంలో గల చిక్కుల గురించీ జాస్తిగా చర్చలు జరుగుతున్నాయి. రాకరాక ప్రజలకు వోటింగు అధికారం వస్తే వారు ఆనందించటానికి బదులు దీన్ని ఏంచెయ్యాలో తెలియక నిష్కారణంగా సతమతమవుతున్నారు. తిండి లేకపోయినా, బట్ట లేకపోయినా, సాధారణ పౌరహక్కులు లేకపోయినా ఆందోళన చెందని ప్రజలు వోటు ఏంచెయ్యాలో తెలీక బాధపడటం ఏమీ బాగాలేదు.

ఆడపిల్లను కన్నతండ్రి ఆపిల్లను ఒక అయ్య చేతిలో పెట్టటం ఎంత తప్పనిసరో వోటు కల వాడు తన వోటును ఎవరో ఒక అభ్యర్థికి ధార పొయ్యటం అంత తప్పనిసరి. ఈ సంగతి ప్రతి వోటరూ జ్ఞాపకం ఉంచుకోవాలి.

ఏ అభ్యర్థి అన్న సమస్య వస్తుంది. అది కూడా [illegible] స్యే [illegible] ఎందుకంటే మీకీ వోటింగు హక్కు ఇప్పించిందెవరు? కాంగ్రెసు. అందుచేత మీ వోటు కాంగ్రెసుది. దాన్ని కాంగ్రెసు అభ్యర్థులకే ఇచ్చెయ్యండి.

ఎవరు కాంగ్రెసు అభ్యర్థులు? ఇది సమస్యే. మనం కాంగ్రెసు వాళ్ళనుకున్న వారు ఇవాళ చాలా పార్టీలలో ఉన్నారు. కానీ మీరీ పార్టీలన్నిటినీ పాటించ నక్కర్లేదు. కాంగ్రెస్ "గుడ్‌విల్" గల పార్టీ ఒకటే ఉంది. దానికే మీ వోటు. అది నిలబెట్టిన ప్రతినిధుల మంచిచెడ్డలను మీరు చూడవద్దు. వారిని గురించి పొరపాటున మీకు కొంత తెలిసి ఉండవచ్చు. తెలిసినదంతా మంచే కాకపోవచ్చు. అదంతా మరిచిపోండి. ఎందుకంటే వారిని మనం ఎన్నుకుంటే ఇప్పుడున్న కాంగ్రెసు ప్రభుత్వం మరో అయిదేళ్ళపాటు పదవిలో ఉంటుంది.

ఇది మనకు కొత్త ప్రభుత్వం కాదు. 1947 ఆగస్టు 15 నుంచీ మనం ఎరిగున్న ప్రభుత్వం మనం ఎరిగున్న ప్రజాప్రభుత్వం ఇదొక్కటే. ఇంతకాలమూ ఈ ప్రభుత్వం సాధించిన విజయాలు చూసి నెహ్రూ వంటి నాయకుడే గర్వపడుతూ కాంగ్రెసుపార్టీ నాయకత్వం కూడా తనకే వుంచుకున్నాడు. అటువంటప్పుడు మనం ఈ ప్రభుత్వాన్ని గురించి అసంతృప్తి చెందరాదు.

కొందరు గిట్టనివాళ్ళు కాంగ్రెసు ప్రభుత్వం ప్రజల అవసరాలు తీర్చలేక పోయిందనీ, అధికాహారోత్పత్తి సాగించిన కొద్దీ ఆహారకొరత ఎక్కువయిందనీ, వన మహోత్సవాలతో కూడా ప్రజల ఆకలి సమస్య తీరలేదనీ, ఈ ప్రభుత్వం వస్తువుల ధరలను అదుపులో ఉంచలేక పోయిందని విమర్శిస్తారు. మనం అటువంటి స్వార్థ సంకుచితబుద్ధితో చూడరాదు. విశాల దృక్పథంతో చూడాలి. విశాల దృక్పథంతో చూసినట్టయితే మన కాంగ్రెసు ప్రభుత్వం దేశక్షేమాన్ని మాత్రమే మనసులో ఉంచుకుని ఎన్ని వేల దేశద్రోహులను కాల్చిచంపిందో, ఎన్ని వేలమందిని ముందు జాగ్రత్తపడి ఖైదు చేసిందో, రాజ్యాంగంలో గల పౌరహక్కుల మూలంగా దేశం భస్మీపటలం గాకుండా ఎట్లా రాజ్యాంగ సవరణలూ, పత్రికలపై కట్టుదిట్టాలూ ఏర్పాటు చేసిందో గ్రహించగలుగుతాం.

ఈ నాలుగేళ్ళ చల్లని కాంగ్రెసు పరిపాలనలో యెంతమంది కొత్తగా లక్షాధికార్లయినారో, దాచిపెట్టి పన్నులు ఎగగొట్టదగిన ఆదాయాల ప్రమాణం ఎట్లా పెరిగిందో మనం చూస్తూనే ఉన్నాం. ఇదంతా దేశ సౌభాగ్యం కాదా? ఈ లెక్కన అందరి ఆదాయాలూ పెరగాలంటే అది సాధ్యమా?

కాంగ్రెసు పరిపాలనకింద అవినీతి పెరగటంకూడా ఒక దోషంగా ఎంచ వీలులేదు. ఐహిక సంపద వెంట అంతో ఇంతో అవినీతి

(తరువాయి 42వ పేజీలో)

# కృపలానీ ప్రశ్నలు

తుర్లపాటి వెంకట కుటుంబరావు

నవంబరు 19వ తేదీన విజయవాడలో సుమారు 25 వేలమంది ప్రజానీకం సమావేశమైన బ్రహ్మాండమైన బహిరంగసభలో ఆచార్య కృపలానీ ప్రసంగించాడు. ఈ ప్రసంగంలో ఆయన కొన్ని చక్కని సూక్తులను వెల్లడించాడు. ఈ సందర్భంలో ఆయన కొన్ని మహత్తర సత్యాలను బహిర్గతం చేయడమే కాక, ప్రస్తుత దేశ పరిస్థితికి సంబంధించి, ప్రజల మనః ప్రవృత్తులకు సంబంధించి ఆయన కొన్ని ప్రశ్నలు కూడా వేశాడు. రాజకీయంగా ఆయన ఏ పార్టీకి చెందినా, ప్రస్తుత దేశ పరిస్థితులలో ఆయన ప్రకటించిన సూక్తులను గురించి, వేసిన ప్రశ్నలను గురించి పార్టీ విభేదాలు లేక ప్రతి భారతీయుడు ఆలోచించక తప్పదు.

నేడు నాయకులనేవారిని ప్రజలు విపరీతంగా ప్రశంసించడం ఒక దురలవాటుగా పరిణమించిందని ఆయన అన్నాడు. ముఖ్యంగా పౌర సన్మానాల సందర్భంలో వ్యక్తులను విశేషంగా ముఖస్తుతి చేస్తున్నారని ఆయన విమర్శించాడు.

ఆచార్య కృపలానీ చెప్పింది అక్షరాల నిజం. మన నాయకులలో నాయకులువున్నారు. వినాయకులుకూడా వున్నారు. నిజమైన నాయకులను, నాయకత్వ లక్షణాలు, అందుకు కావలసిన సంపూర్ణ యోగ్యతార్హతలు వున్న వారిని ప్రజలు ఆరాధించినా ప్రమాదం లేదు. కాని, దురదృష్టవశాత్తు నేడు కొందరు వినాయకులను కూడా ప్రజానీకం ఆరాధిస్తున్నారు. అట్టివారిని పౌర సన్మానాల సందర్భాలలో ఇతర బహిరంగ సభలలో "ఇంద్రులని, చంద్రులని" ముఖస్తుతి చేయడం జరుగుతున్నది. ఈ వినాయకులలో నిజంగా "ఇంద్రత్వం, చంద్రత్వం" లేకపోయినా, ప్రజానీకం వారిని విపరీతంగా ముఖస్తుతి చేయడం వల్ల తమలో నిజంగా అవి వున్నవనే వారు భ్రమిస్తున్నారు. తత్ఫలితంగా వారిలో ఒక విధమైన దురహంభావం ప్రబలుతున్నది. ప్రజాసామాన్యానికంటే తాము భిన్నమైన వారమని, వారికంటే తాము అనేకరెట్లు అధికులమని భావిస్తున్నారు. తాము ఇంతగా ఘనులమని, మహానాయకులమని వారు భ్రమిస్తున్నందున ప్రజాసామాన్యానికి చెందిన ఎవరైనా తమను సహేతుకంగా విమర్శించినా, దానిని ఎంతమాత్రం సహించలేనిస్థితికి వచ్చారు. తమను ఎంత నిర్మాణాత్మకంగా, సహేతుకంగా విమర్శించినా, అట్టి వారిని తమ శత్రువులుగా పరిగణిస్తున్నారు. తమను ముఖస్తుతి చేసినవారే తమ ప్రియమిత్రులు; తాముచేసే అకార్యాలను తప్పిదాలను విమర్శించేవారు తమ గర్భశత్రువులు—ఇట్టి శోచనీయస్థితికి కొందరు (వి)నాయకుల స్థితి దిగజారి పోయింది.

ఇందుకు కారకులు ఎవరు? వారిని విపరీతంగా ముఖస్తుతిచేసి, వారిని అంబర వీథులకు ఎత్తివేసే ప్రజలే. కనుక ప్రజలు ఏ నాయకుని విపరీతంగా ప్రశంసించడం అనవసరం; ప్రమాదకరం. ఎవరికి ఎంతవిలువ ఇవ్వాలో అంతకంటె ఎక్కువ ఇస్తే, అది విపరీతపరిణామాలకు దారి తీస్తుంది. ఈ విషయాన్ని పురపాలక సంఘాలు పంచాయతీ బోర్డులు, తదితర ప్రజా సంస్థలు, ప్రజాసామాన్యం గుర్తించడం అవసరం.

"మన ఆహార కొరతకు కారణం అతివృష్టి, అనావృష్టి మున్నగు ఈతిబాధల కారణమని ప్రభుత్వం చెబుతున్నది. మనం 'వర్షాధిపతి ఇంద్రుని' తరతరాలుగా ఆరాధిస్తున్నాము. మరి, ఇప్పుడు అతివృష్టి, అనావృష్టులకు కారణమేమిటి? ఇంద్రునికి కూడా మన ప్రభుత్వంపై తన ఆరాధకులపై క్రోధం కలిగిందా?" అని ఆచార్య కృపలానీ ప్రశ్నిస్తున్నాడు.

ఈ ప్రశ్న మిక్కిలి సమంజసంగా వున్నది. భారతీయులు దైవభక్తులు. మన ప్రభుత్వాధినేతలకు కూడా దైవభక్తి పూర్తిగావున్నది. వనమహోత్సవాలు, స్వాతంత్ర్యదినోత్సవాలు

నాళల జలప్రవేశ మహోత్సవాలు శాస్త్రోక్తంగా, దైవ పూజతో ప్రారంభించబడుతున్నవి. మన ప్రభుత్వాధినేతలకు ఇంత దైవభక్తి వున్నా, దేవుడు వారిపై కరుణించి వర్షించడం లేదేమి సకాలంలో?

కాగా, మన ప్రక్కనేవున్న నవచైనా ప్రభుత్వాధినేతలకు దేవునిలో విశ్వాసంలేదు. వారు అధికారంలోనికి వచ్చిన రెండు సంవత్సరాలలో యెంతో మహత్తరమైన అభివృద్ధిని సాధించారు? వివిధ రంగాలలో వారు సాధించిన అభ్యున్నతని గురించి గాంధీజీ ప్రియతమ శిష్యుడు శ్రీ జె.సి. కుమారప్ప, పండిట్ నెహ్రూ ద్వితీయ సోదరి భర్త శ్రీ జి. పి. హాతీసింగ్, సుప్రసిద్ధ కాంగ్రెస్ నాయకుడు పండిట్ సుందర్‌లాల్, చైనాలో ఇండియా రాయబారి సర్దార్ కె. ఎమ్. పణిక్కర్‌లు అక్కడ పరిస్థితులను స్వయంగా తిలకించివచ్చి చెప్పలేదా? నవచైనాలో దారిద్ర్య కాటకాలు నిర్మూలించబడినవని, ఇందుకు అక్కడ అమలు పరచబడిన ఆర్థిక, భూస్వామ్య సంస్కరణలే కారణమని నవంబర్ 21వ తేదీన కూడా సర్దార్ పణిక్కర్ పారిస్‌లో చెప్పలేదా?

మార్షల్ చాంగ్ ప్రభుత్వ హయాంలో చైనా సంవత్సరానికి 10 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకునేది. అప్పుడు చైనీస్ ప్రజానీకం నిరంతరం కరువు కాటకాలతో, దారిద్ర్య దైన్యాలతో దుఃఖపిల్లుతూ వుండేవారు. కాని, నూతన ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన ప్రథమ సంవత్సరంలోనే విదేశాలనుంచి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవడం విరమించి, ఆహార స్వయం పోషకత్వాన్ని సాధించి, పైగా 1949–50లో ఒక కోటి టన్నుల ఆహార ధాన్యాలను అదనంగా పండించలేదా? దేవునిలో విశ్వాసం లేనివారు ఇంత మహత్తరమైన అభివృద్ధిని ఎలా సాధించగలిగారు? దేవునిపై విశ్వాసం వున్న భారతీయులు అతివృష్టి, అనావృష్టులతో, దారిద్ర్య కాటకాలతో బాధపడడమేమిటి? దేవునిపట్ల నమ్మకంలేని నవచైనా ప్రభుత్వాధినేతలు అప్రతిహతంగా పురోగమించడమేమిటి? ఇందుకు మన ప్రభుత్వాధినేతలు ఏమి సమాధానం చెబుతారు? ప్రతి విషయానికి ప్రభుత్వానిదే బాధ్యత అని అంటున్నారని ప్రజలను ప్రభుత్వాధిపతులు నిందిస్తున్నారు. అయితే, ప్రతి విషయానికి బాధ్యత భగవంతునిదేనని ప్రభుత్వం చెప్పడం మాత్రం సమంజసంగా వున్నదా?

మన ఆహార కొరతకు బాధ్యతను "భగవంతుని"పై వేయడం ఎంతమాత్రం భావ్యం కాదు. మన ఆహారకొరతకు కారణం ప్రభుత్వమే. చైనా పరిస్థితులు, ఇండియా పరిస్థితులు సమానంగానే వున్నవి. చైనా వలె ఇండియా కూడా వ్యవసాయక దేశమే. కనుక, చైనాలోవలె మనదేశంలో కూడా భూస్వామ్య సంస్కరణలు అమలు పరచి, "దున్నేవానిదే భూమి" అనే సిద్ధాంతాన్ని అమలు జరిపి, అధికోత్పత్తికి ఆధునిక సాధన విధానాలను ప్రవేశపెట్టి, రైతాంగంలో ఉత్సాహోత్తేజాలను పూరించిననాడు మన ఆహార సమస్య తప్పక పరిష్కారం కాగలదనడానికి ఎట్టి సందేహం లేదు.

"మన ఆహారకొరతకు ప్రభుత్వం మరొక కారణాన్ని చెబుతున్నది. ప్రజలు అధిక సంతానోత్పత్తి చేస్తున్నారట! అయితే, ఈ అధిక సంతానోత్పత్తి అనేది స్వాతంత్ర్య సిద్ధికి పూర్వంనుంచి జరుగుతున్నదా, లేక స్వాతంత్ర్యావతరణ పిదపనే జరుగుతున్నదా" అని ఆచార్య కృపలానీ అడుగుతున్నాడు.

ఔను! అధిక సంతానోత్పత్తి ఆకస్మికంగా స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుంచి—ఆగస్టు 15, 1947 నుంచి—ప్రారంభమైనదా? సోవియెట్ రష్యాలో సంవత్సరానికి ముప్పై లక్షల వంతున జనాభా వృద్ధి కావడంలేదా? జపాన్‌లో సంవత్సరానికి ఇరవైయేడు లక్షల వంతున, చైనాలో యాభైలక్షల వంతున జనాభా అభివృద్ధి చెందడంలేదా? అమెరికాలో మాత్రం జనాభా వృద్ధి చెందడంలేదా? జనాభా పెరుగుదల అనేది మన ఒక్క దేశానికి మాత్రమే రాలేదుకదా! జనాభా పెరుగుదలకు అనుగుణంగా ఆహారపదార్థాల ఉత్పత్తిని ఆయాదేశాలు వృద్ధిచేసుకోవడంలేదా? చైనాలో అంగుళం మేరకూడా వ్యర్థంకాకుండా ప్రతి ఖాళీస్థలంలో ఏదో ఆహారపంట పండించబడు

తున్నదని ఇటీవల అక్కడ పర్యటించి వచ్చిన గాంధీజీ అనుచరుడు, అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘ కార్యదర్శి శ్రీ జె. సి. కుమారప్ప అన్నాడు. కాని, మనదేశంలో ఏమి జరుగుతున్నది? వ్యవసాయానికి అనువైన తొమ్మిదిన్నరకోట్ల ఎకరాల బంజరుభూమి పడివున్నది. దానిని సేద్యం చేస్తే, మన ఆహారసమస్య పరిష్కారం కాదా? ఈ బంజరుభూమిని సేద్యం చేయడానికి ప్రభుత్వం ఏమి చర్యలు గైకొన్నది? అధికాహారోత్పత్తికి కోట్లకొలది రూపాయలు వ్యయం చేయబడినవి కాని, అందువల్ల ఏమైనా ఫలితం కలిగిందా? సమర్థమైన సక్రమమైన విధానాలను అవలంబించనిదే, ఏ ఉద్యమమైనా సత్ఫలితాలను కలిగిస్తుందా?

“దేశంలో ప్రబలిన అవినీతికి లంచగొండితనానికి, బ్లాక్ మార్కెటింగ్ కు కారణం ప్రజల నైతికపతనమేనని ప్రభుత్వనాయకులు చెబుతున్నారు. ఐతే “నైతికపతనం” చెందిన ఈ ప్రజల ద్వారానే కదా గాంధీజీ స్వాతంత్ర్యాన్ని సాధించింది?” అని ఆచార్య కృపలానీ ప్రశ్నిస్తున్నాడు.

ఇది చక్కని ప్రశ్న. అపారమైన అంగబలం, అశేషమైన ఆర్థిక సంపత్తి, వివిధ మారణాయుధాలు కలిగి రవి అస్తమించని బ్రహ్మాండమైన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని “నైతికపతనం” చెందిన ఈ ప్రజలతోనే కాదా గాంధీజీ ఢీకొన్నది? ప్రజలలో వున్న కేవలం నైతిక బలంతోనే కదా ఆయన స్వాతంత్ర్య సమరంలో భాగమైన వివిధోద్యమాలను నిర్వహించింది? అప్పుడు ప్రజలలో నైతికపతనం లేదు కదా! స్వాతంత్ర్యం సిద్ధించగానే ప్రజలలో ఆకస్మికంగా నైతికపతనం కలిగిందా? అయితే, అందుకు బాధ్యులు ఎవరు? వారిని నడిపే నాయకులే కదా! వ్యక్తులలో కొన్ని లోటుపాట్లు వుండవచ్చు. కాని, ఒక జాతిగా ప్రజలు ఎన్నడూ మారరు. వారిని మార్చేది నాయకులు మాత్రమే. నాయకులలోని లోటుపాట్లే ప్రజలలో కూడా ప్రతిబింబిస్తూవుంటాయి. ఉదాహరణకు, రెండు సంవత్సరాల క్రితం చైనీస్ ప్రజలలో అవినీతి, బ్లాక్ మార్కెటింగ్, నిరుత్సాహం వ్యాపించినవి. అందుకు కారణం అప్పుడు వారికి నాయకత్వం వహిస్తున్న కొమిన్ టాంగ్ పార్టీ ప్రముఖులలో ప్రబలిన అవినీతి, బ్లాక్ మార్కెటింగ్ మున్నగు దుర్లక్షణాలే. వాటి ప్రభావమే చైనీస్ ప్రజాసామాన్యంలో కూడా ప్రసరించింది. కాని, నేడు చైనీస్ ప్రజలలో నూతనోత్తేజోత్సాహాలు వెల్లివిరుస్తున్నవి. మహత్తరమైన జాతీయ పునర్నిర్మాణంలో పాల్గొని, అతి స్వల్పకాలంలో వారు అనల్పమైన అభివృద్ధిని సాధించారు. కాగా మారింది ఎవరు? అప్పటికీ, ఇప్పటికీ మారింది నాయకులు మాత్రమే. అప్పటి చైనీస్ జాతే ఇప్పుడుకూడా వున్నది. అదేవిధంగా నైతిక బల సంపన్నుడైన గాంధీజీ నాయకత్వంలో ప్రజలలోకూడా నైతికబలం వృద్ధి పొందింది. కాని, నేటి నాయకుల హయాంలో ప్రజలలో నైతికబలం సన్నగిల్లడానికి కారణమేమిటి? నాయకులలోనే నైతిక బలం లేనప్పుడు ప్రజలలో యెక్కడనుంచి వస్తుంది? నాయకులలోనే అవినీతి అధికమైనప్పుడు, వారిని అనుసరించే ప్రజలలో మాత్రం నీతి ఎక్కడిది? “యథారాజా తథాప్రజా” అనే సామెత ఊరికే వచ్చిందా?

పరిస్థితులను, ప్రజలను తమకు అనుకూలంగా మార్చుకొనవలసింది నాయకులే. ప్రజలను నిందించి తప్పుకోడానికి ప్రయత్నించడం దుర్మార్గవర్తన.



ఆసుపత్రులలో రోగులకు యిడ్లీ, సాంబారు యివ్వవచ్చునో తగదో అభిప్రాయము తెలుపవలసిందిగా ప్రభుత్వము డాక్టర్లను కోరినట్లు తెలుస్తున్నది. అభిప్రాయాలను సేకరించిన వెంటనే ప్రభుత్వము ఈ విషయమై ఒక నిర్ణయానికి రాగలదట. ఇడ్లీ, సాంబారు యిచ్చే పక్షములో రోగులకు ఆహారము నిమిత్తము ఖర్చు పెట్టబడే డబ్బులో కొంత మిగలగలదని అంచనా వెయ్యబడింది.

# నిష్పాక్షిక రచనలు : "అశ్వని"

"అశోక్"

"అశ్వని" గారు "కమ్యూనిస్టు మతోన్మాది" అని వి. ఎల్. నరసింహారావు వగైరాలు "తెలుగు స్వతంత్ర"లో పదేపదే అంటున్నారు. గోబెల్సులాగా అన్నమాటే పదిసార్లు అంటే నమ్ముతారని వారనుకుంటే, ఆరోజులు గోబెల్సుతోనే పోయినై అనవలసివస్తుంది.

"అశ్వని" గారిని వారు "కమ్యూనిస్టు" అనుకొని "నెహ్రూను కాంగ్రెసునుగానీ, కాంగ్రెసు నెహ్రూనుగానీ ఊపేసినట్టు" ఈ పదాన్ని చూస్తే "కమ్యూనిస్టు" అనే పదానికి వారు తీసే అర్థం సుబోధకం ఔతుంది. వారి అర్థం ప్రకారం "కమ్యూనిస్టు" అంటే "రష్యా, తూ. యూరపు నవచైనా"లను అభినందించేవాడూ, శాంతి ఉద్యమాన్ని బలపర్చేవాడూ, అమెరికామీదా దుమ్మూ, తాలూ ఎత్తిపోసేవాడూ అయి ఉండాలి. నిజానికి ఇటువంటి వాటిని సమర్థించే వాక్యాలను "అశ్వని" గారు తమ రచనల్లో ఉటంకించి వున్నారు. కాని వీటినిబట్టి ఒక వ్యక్తిని "కమ్యూనిస్టు" అని అనవలసిన పని ఉండదు. ఎందువల్లనంటే రష్యా, తూ. యూరపు, నవచైనాలను "కమ్యూనిస్టు" కానివాళ్ళు కూడా అభినందిస్తూనే ఉన్నారు. ఇందుకు నిదర్శనం ఇటీవలనే రష్యాకూ, చైనాకూ ఇండియానుండి వెళ్ళిన సుహృద్భావ సంఘసభ్యుల ప్రకటనలను నిదర్శనంగా తీసుకోవచ్చు. శాంతి ఉద్యమాన్ని బలపర్చేవాళ్ళు కూడా కమ్యూనిస్టులు కావలసిన పనిలేదు. కాని కమ్యూనిస్టులుగూడా ఆ ఉద్యమాన్ని బలపరుస్తున్నప్పుడు దానికి సంజాయిషీ చెప్పవలసిన బాధ్యత "అశ్వని" గారిమీద ఉండదు. ఇక అమెరికామీద "దుమ్మెత్తడం" గురించి విచారిస్తే "అశ్వని"గారు అమెరికాలో ఒక పక్షం వారికి అనుసరిస్తున్న విధానాలను సకారణంగా, నిదర్శన పూర్వకంగా విమర్శిస్తున్నారేగాని అమెరికా జాతినిగురించీ, ఆదేశ సంస్కృతి, సభ్యతలను గురించీ ఆయనగారు మాట్లాడటంలేదు. అమెరికా ప్రజలతో ఆయనకు పేచీలేదు. అమెరికాలో మాట్లాడటానికి తనకు అనుమతిలేదని ప్రొఫెసరు కుమారప్ప గారు అంటున్నారు. అమెరికాలో నీగ్రోలకున్న స్వతంత్రమూ, "మిత్రరాజ్య సమితి"కున్న స్వతంత్రమూ, కొరియాలో అమెరికన్లు "స్వతంత్రించి" చేసిన పనులూ ప్రతి ఒక్కరూ ఖండించారు. అందులో "అశ్వని" గారూ ఒకరైతే ఆయన "కమ్యూనిస్టు" కావలసిన పనిలేదు.

ఇక వీరి నిర్వచనం ప్రకారం "హ్యూమనిస్టు" ఉద్యమకారుడు రాయ్‌కూడా "కమ్యూనిస్టు"యే ప్రమాదముంది. కొరియా యుద్ధం ముమ్మరంగా జరిగే రోజుల్లో "దివ్యరాజ్యం"లోని హ్యూమనిస్టుల్లో ఆంధ్రదేశం తాలూకు వాళ్ళు ఆయన ఆంధ్రపర్యటనకు వచ్చినప్పుడు, అమెరికా విధానాన్ని ఆయన ఖండించడంలో అంతర్యం ఏమని, సమాధానంకోసం నోళ్ళు తెరుచుకొని కూర్చున్నారు. అప్పుడు రాయ్ చెప్పిన సమాధానం ఏమంటే తన్ను రష్యా అమెరికా ఏజంటనీ, అమెరికా "కమ్యూనిస్టు ప్రతినిధి" అనీ అంటుంటారనీ, ఎవరేమన్నా సహేతుకంగా ఉన్నంత వరకూ తాను ఏ పక్షంవారినైనా సమర్థిస్తాననీ, సంకోచించననీ "కాలజ్ఞానం" బయట పెట్టేరు. మంచో, చెడో ఒక తత్వాన్ని ఆయన జీర్ణించుకున్నవాడు కాబట్టి ఆ విధంగా మాట్లాడేడు. అందుకు తగినట్టే చర్చిల్ ఎన్నికను గురించి ఇటీవల "హ్యూమనిస్టు" పత్రికలో రాస్తూ గూడా లేబర్‌పార్టీ పరాజయానికి అది కొన్ని సిద్ధాంతాలను మూఢంగా అనుసరించడం అని చెప్పి కమ్యూనిస్టు రాజ్యాల సహకారాన్ని తృణీకరించి అమెరికా భిక్షకు అర్రులు చాపడం వల్లనే బ్రిటన్ ఆర్థికంగా దెబ్బ తిన్నదని అన్నారు. సిద్ధాంత రాద్ధాంతాలకు స్వస్తిచెప్పి ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో రష్యాతో సంపూర్ణ సహకారం ద్వారా యుద్ధమంత్రిగా

విజయం చూరగొన్నట్టే కమ్యూనిస్టు రాజ్యాలతో మిత్రత్వ సంధులు చేసుకోడం ద్వారా చర్చిల్ ఆర్థిక క్లిష్టత నుండి కూడా బ్రిటన్‌ను కాపాడగలడని ఆ వ్యాసంలో రాయ్ ఆశించాడు. ఇక రాయ్‌ని కూడా మనం కమ్యూనిస్టు జాబితాలో వేసుకోవాలో, "అశ్వని" గారి పేరును ఆ జాబితా నుండి తొలగించాలో ఏ. ఎల్. నరసింహారావుగారే చెప్పవలసి ఉంది.

ఇక "అశ్వని" గారిని గురించి చెప్పవలసి ఉంది. సాంస్కృతికంగా "సహారా ఎడారి"ని పోలిన మన దేశప్రజల సంస్కృతిని లెఖలోకి తీసుకుంటే "అశ్వని" గారు తమ రచనల వల్ల ప్రజలకు ఎంతో మేలును—ముఖ్యంగా దేశం ఎదుర్కొంటున్న ఈ క్లిష్టపరిస్థితుల్లో — చేస్తున్నారనే చెప్పాలి. "అశ్వని" గారు కమ్యూనిస్టు దేశాలను గురించి చేసే "స్తోత్రా"లనూ, ఆయన మనస్సు సర్వదా "సైబీరియా" వచ్చిక భూముల్లో విహరించడాన్ని (వచ్చిక భూములు ఎడారి భూములకంటే నయం) గమనించిన వాళ్లు ఇటీవల మనదేశంలో కమ్యూనిస్టులు అనుసరించిన విధానాన్ని "అశ్వని" గారు నిర్మొగమాటంగా ఖండించడమూ, జపాన్ మీద అటం బాంబును అమెరికా గత యుద్ధంలో ప్రయోగించినప్పుడు మారణాయుధాల వినియోగాన్ని గర్హిస్తూ ఆయన ఆ రోజుల్లో చేసిన పత్రికా ప్రకటనను గుర్తెరుగక అందినవారికల్లా వీరు "కమ్యూనిస్టు" ముద్ర వేయడం శోచనీయం. "మతి"మంటే "మూఢ భావాలను నెమరు వేయడం" అని ఏ. ఎల్. నరసింహారావుగారు అర్థంతీస్తే "కమ్యూనిస్టు వ్యతిరేక మతం"లో పడి ఏ ఆశయాలకోసం రాడికల్ డెమాక్రటిక్ పార్టీ రద్దయి, హ్యూమనిస్టు ఉద్యమం అమలులోకి వచ్చిందో ఆ ఆశయాలకీ—మూఢ రాజకీయాలకీ తిల ఒగ్గి—వారు "గురువుకు పంగనామాలు పెడుతున్నారు" అనుకోవలసి వస్తుంది.



# మన "సెక్యులర్" ప్రభుత్వం

"తారానాథ్"

ఎలెక్షనులు సమీపిస్తున్నకొద్దీ, ఏపార్టీకాపార్టీ గెలుద్దామనే తాపత్రయం జాస్తి అయింది. అధికారంలోవున్న రాజకీయపక్షము-కాంగ్రెస్ అభ్యర్థులను గెలిపించటానికి కాంగ్రెస్ నాయకులు పూర్తిగా కృషిచేస్తున్నారు. ఎన్నికలు జరుగబోయే ప్రాంతాలలో పర్యటన చేస్తున్నారు.

కాంగ్రెస్ అధ్యక్షుడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ హిమాచల ప్రదేశ్ ఈమధ్యనే పర్యటించి వచ్చారు. ఇక్కడ కాంగ్రెస్‌కు ప్రధాన ప్రతిపక్షి జన సంఘ్. కాని వారి నామినేషన్ పత్రాలు సుమారు ఆరు దాకా నిరాకరించటంతో వారి అభ్యర్థుల సంఖ్య తక్కువయింది.

ఎలెక్షన్ ప్రచారంలో కమ్యూనలిస్టులు, కాపిటలిస్టుల సహాయులు అనే ఆరోపణలతో పాటు నెహ్రూజీ ఇంకొక ఆయుధాన్ని ప్రయోగించటం ప్రారంభించారు. పఠాన్‌కోటలో నవంబరు 15న మాట్లాడుతూ కాంగ్రెసుకు వేసే ప్రతి వోటు సెక్యులరిజాన్ని బలపరిచేదే అని సెలవిచ్చారు.

ఇప్పుడు అధికంగా చలామణి అవుతున్న పదాలలో ఈ సెక్యులరిజమ్ ఒకటి. అంతే కాదు మనది సెక్యులర్ స్టేట్. సెక్యులర్ స్టేట్ సంభవమా, లేక అసంభవమా అనే విషయమై సిద్ధాంతరీత్యా జరిగే వాదనలను ఒక ప్రక్కన ఉంచి, మన సెక్యులర్ స్టేట్‌లో సెక్యులర్ గవర్న్మెంటు ఎలా ఉందో చూద్దాం.

నేడు ప్రపంచంలోని అన్ని నాగరిక ప్రభుత్వాలు సెక్యులర్ ప్రభుత్వాలే. మతానికి, కులానికి ప్రాముఖ్యాన్నివ్వటం లేదు. నిజానికి అలా జరగటము చాలా వాంఛనీయమైన విషయమే. కాని ప్రభుత్వ హయాంలో అలా జరగటంలేదు. ఒక వర్గాన్ని పూర్తిగా అభిమా

నించటం జరుగుతుంది. ఆ అభిమానం ఎంతవరకు పోయిందంటే, దేశ క్షేమాన్ని కూడా ఈ నీచాభిమానానికి బలిచేయటందాకా పోయింది. దీనికి ఒక ఉదాహరణ చాలు.

అక్టోబరు మాసం ప్రారంభంలో కస్టోడియన్ జనరల్‌గా ఉంటున్న జస్టిస్ అచ్చూరాం చేత రాజీనామా దాఖలుచేయబడింది. ఈవిషయాన్ని గురించి పార్లమెంటులో కామత్ ప్రశ్నించాడు కూడాను. శ్రీ అచ్చూరాం పంజాబ్ హైకోర్టు న్యాయాధిపతి, ఒక శరణార్థి కూడా. నిర్వాసితుల వ్యవహారాల విషయంలో పని చేయటానికని ఈయన నిష్పక్షపాతి అని, కస్టోడియన్ జనరల్‌గా నియమించటం జరిగింది.

దీనికి కారణం జూలై మాసాంతంలో జరిగిన ఒక సంఘటన. ఢిల్లీలో ఫైరుద్దీన్ జపాన్‌వాలా, ఇస్మాయిల్ జపాన్‌వాలా అని ఇద్దరు వ్యక్తులు ఉన్నారు. వీరికి సుమారు రెండుకోట్ల దాకా ఆస్తి ఉంది. ఢిల్లీలోని కారొనేషన్ హోటల్ భవనాలు, మెరినా హోటల్ భవనాలు వీళ్ళవే. అంతేకాక లాహోర్‌లోని పాంఛోలి ప్రొడక్షన్స్‌తోగూడా సంబంధం ఉందంటారు. వీళ్ళు "వెళ్ళదలచుకున్న" వ్యక్తులుగా లెక్క వేయబడుతున్నారు. (పాకిస్తాన్‌కు వెళ్ళిపోవటానికి సిద్ధంగాఉన్న వ్యక్తులన్న మాట) నిర్వాసితుల ఆస్తులకు సంబంధించిన చట్టంనుంచి యెవరినైనా తప్పించే అధికారం కేంద్రప్రభుత్వానికి ఉంది. అందుచేత ఈ వ్యక్తులు కస్టోడియన్ జనరల్‌కు అప్పీలు చేయకుండా సరాసరి కేంద్రప్రభుత్వానికి అప్పీలు చేసుకొని ఎవాక్యూ ప్రాపర్టీ ఆక్టునుంచి తప్పింపబడ్డారు. ఈ విధంగా సుమారు రెండుకోట్ల ఆస్తి నిరాఘాటంగా పాకిస్తాన్‌కు తర్లించుకుపోవటానికి వీలు కల్పింపబడింది.

ఇటువంటిదే ఇంకొక సంఘటన జరిగింది. మొహమ్మద్దీన్ ఛత్రీవాలా గొడుగుల వ్యాపారి. సుమారు కోటిరూపాయల ఆస్తిగల వ్యక్తి. 1947 లో కరాచీకి వెళ్ళి 47000 రూ. లకు ఒక మూడు అంతస్తుల భవనాన్ని కొన్నాడు. అంతేకాదు కరాచీలో స్థిరనివాసాన్ని ఏర్పరుచుకో దలిచి, ఒక హిందూ వ్యాపారివద్దనుంచి ఒక మిల్లునుగూడా కొన్నాడు. కొనటమే కాకుండా దానిని నడిపేందుకు కావలసిన వస్తువులకోసం అప్పటి కరాచీ సివిల్ సప్లయిస్ డిపార్టుమెంటులోని ఒక ఉద్యోగస్థుడు వెళ్ళటంకూడా జరిగింది. ఆ ఉద్యోగి హిందువు. పేరు షేక్ చాందినీ. ప్రస్తుతం ఢిల్లీలో ఒక నిర్వాసి. ఈ ఛత్రీవాలా కేసు కస్టోడియన్ జనరల్ ముందుకు విచారణకొచ్చింది. తగిన కారణాలు లేకుండా, ధనాన్ని పాకిస్తాన్‌కు పంపుతున్నాడని ఋజువయింది. అందులో షేక్ చాందినీ సాక్ష్యంకూడా ఇచ్చాడు. కాని ఈ వ్యక్తినీ కేంద్రప్రభుత్వం తప్పించింది!

● ఈ విషయాలలో అచ్చూరాం రాజీనామా ఇవ్వాలసి వచ్చింది. అక్టోబర్ ప్రారంభంలో రాజీనామా సమర్పించాడు.

అక్టోబర్ మొదటి వారంలో ఆయన గౌరవార్థము జరిగిన విందులో కృపలానీ, పంజాబ్ నేషనల్ బ్యాంక్ డైరెక్టర్ మి. యోధరాజ్ మొదలైనవారంతా పాల్గొన్నారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ శ్రీ అచ్చూరాం కొంతమంది రజాకార్లను, అపాయకారులైన ముస్లింలను, కేంద్రప్రభుత్వ మంత్రులు కొంతమంది జోక్యం కలిగించుకొని, పాకిస్తాన్‌కు పోవటానికి తోడ్పడ్డారని ఆరోపించాడు. ఈ విధంగా అచ్చూరాం చేత రాజీనామా చేయించటం జరిగింది.

ఈ విధంగా సెక్యులర్ ప్రభుత్వం నడుస్తూ ఉంది. తిరువాన్కూరులో 50 దేవాలయాలను చెడగొట్టినా మన సెక్యులర్ ప్రభుత్వానికి చీమైనా కుట్టలేదు. అదే మైనారిటీలనే వారికి చెందిన పవిత్ర స్థలమైతే నెహ్రూజీ భరించగలిగేవారేనా?

పేర్లు ఎన్ని ఉన్నప్పటికీ పరిపాలనలో మనది శుద్ధ కమ్యూనల్ ప్రభుత్వమల్లే వర్తిస్తూంది. దానినే మన నాయకమ్మన్యులు అంతా సెక్యులర్ స్టేట్ అని తాళం కొడుతున్నారు. ఇటువంటి ప్రభుత్వాన్ని నిలుపుకొనేందుకు ప్రజలంతా వోట్లివ్వాలి. అంతేకాదు. ఇటువంటి సెక్యులరిజాన్ని నిరోధించే వారిని ఎంత మాత్రం సహించరాదని ఒక ప్రఖ్యాత తెలుగు దినపత్రిక సంపాదకీయం కూడా వ్రాసింది! ఇదే నెహ్రూజీ సెక్యులరిజమ్‌లోని బండారం.

# ప్రస్తావనలో రెండు విషయాలు

ముప్పవ గిరిధరరావు

ఈమధ్య స్వామి సీతారాం గుడివాడలో ఉపన్యసించారు. ఆసభకు అగ్రాసనాధిపతి యైన ఒక తెనాలి న్యాయవాదిగారు-స్వామిజీ సభావేశంనుంచి వెళ్ళిపోయినట్లు ధ్రువపరచుకొని - మాట్లాడుతూ ఉపవాసం రాజకీయ ప్రయోజనాలు పొందటానికి పరికరంగా వుపయోగించరాదనీ, మన రాజ్యాంగంలో ఆత్మహత్య అనుమతింపబడలేదనీ అందుచేత ఆత్మహత్యతో తుల్యమైన ఉపవాసం నిషిద్ధమైనదనీ సెలవిచ్చారు.

ఆంధ్ర రాష్ట్ర ఆవశ్యకత, అనావశ్యకతలను గూర్చి యెవరు చెప్పేవాటితోటీ నాకు నిమిత్తం లేదు. ఉపన్యాసాన్ని గూర్చి ఆయన సెలవిచ్చిన అభిప్రాయమే చాలా సందేహాలకు తావిచ్చింది.

అసలు ఉపవాసం చేయగూడదని చెప్పటంలో వివేకం కనపడటంలేదు. యెందువల్లనంటే ఎవరినైనా భోజనం చేయకుండా అడ్డగలటం సంభవమే కాని, ఏ వ్యక్తినీ ఉపవాసం చేయకుండా నిషేధించటం అసాధ్యమని అందరికీ తెలుసు. తెనుగులో గాంధీజీ జీవితం చదివిన బాలబాలికలకు గూడ ఈ విషయం నిరూపించకుండానే అర్థమవుతుంది.

పండిత నెహ్రూ పార్లమెంటులో మాట్లాడుతూ తాను హేతువాదానికి లొంగుతాను గాని ఉపవాసాలకు లొంగేవాడను కానని అన్నాడు.

అసలు సమస్య ఏర్పడటానికి కారణం ఏమిటి? ఇద్దరు వ్యక్తుల్లో ఒకరు సహేతుకంగా లేకపోవటమా? లేక ఇద్దరిలో ఒకరు సహృదయులుగా లేకపోవటమా? ప్రతి వ్యక్తి తాను చేసే ప్రతి పనికీ ఒక కారణాల జాబితా సిద్ధపరచి మన ముందుంచగలడు. అన్ని కారణాలూ అంగీకార యోగ్యంగానే వుంటాయి. అయితే ఆపని చేయటానికి అతని అంతరాత్మ ఒప్పుకుంటున్నదా అని ప్రశ్న వేస్తే నీళ్లు నములుతాడు.

జపాను సైనికులు చైనాలో చేసిన అత్యాచారాలకు త్రోసివేయాలని హేతువున్నది. వారి అధిపతు లాజ్ఞాపించటం. ఐతే ఏ జపాను అంతరాత్మ గూడా స్త్రీలపై అత్యాచారాలు చేయటానికి అనుజ్ఞ ఇచ్చివుండదు. [illegible] పాటించాలని వాదించేవారికి గూడా బలమైన కారణాలే దొరుకుతాయి. అంతరాత్మ ఒప్పుదల మాత్రం లభించదు. ఎన్ని ఖూనీ కేసులు "సకారణంగా" కొట్టివేయబడటం లేదు? శిక్ష తప్పించుకొన్న హంతకుడు జడ్జిని మోసగించినా, తన అంతరాత్మను మాత్రం మోసం చేయలేడు గదా!

నిజంగా పండిత నెహ్రూ తాను ఉపవాసాలకు బెదరక పోయినా హేతువాదానికి లొంగుతానని అనటం కంటె అంతరాత్మ ఆజ్ఞకు జవదాటనని అన్నట్లయితే ప్రజల అభినందనలకు అర్హుడయేవాడు. నిజమైన "భారత" దేశాధినేతగా అశేషప్రజల మన్ననలకు పాత్రుడయేవాడు. మన దురదృష్టవశాత్తూ భారతీయుడవటానికే ఆయన సిగ్గుపడుతున్నాడు.

యంత్రం సకారణంగా పని చేస్తుంది. కారణం యొక్క పరిణామమే యంత్రం. శరీర రూపం పొందిన స్వార్థమే పశువు. తన సంతానాన్ని తానే తినటం పశులక్షణం. మానవుడు యంత్రం కాదు; మానవుడు పశువు కాదు. మానవునిలో మానవత్వం అనే ఉత్కృష్ట లక్షణం వున్నది. అది హేతువుకు అతీతమైన, స్వార్థానికి అతీతమైన హృదయం యొక్క అదుపాజ్ఞలలో మానవుని నడిపిస్తుంది. ఆ హృదయవికాసమే ప్రపంచంలో శాంతి స్థాపిస్తున్నది. అంతరాత్మ ప్రబోధమును ఆచరించటమే భారతీయతలోని విశిష్టం.

వ్యక్తుల్లో పశుత్వం ప్రబలటమే సమస్యలుత్పన్నమవటానికి కారణం. సమస్యకు కారకులైన వ్యక్తిలో నివురుగప్పి అడుగున పడివున్న మానవత్వాన్ని ప్రేరేపించి పశుత్వాన్ని జయిం

చటమే సమస్యను పరిష్కరించటానికి సరియైన మార్గం. దీనికై అతనిలోని హృదయాన్ని కరిగించే విధానాలను అన్వేషించాలి. ఆ వ్యక్తికి పరిస్థితులు వివరంగా తెలియపరచి న్యాయమైన మార్గాన్ని అతని ముందుంచటమూ, అవి విఫలమైతే సహృదయులైన మధ్యవర్తుల సహాయం పొందటమూ, అవి గూడా విఫలమైతే ఆ వ్యక్తియొక్క అంతరాత్మకు విషయాన్ని నివేదించేటందుకై ఉపవాసం చేయటమే మిగిలివున్న మార్గం. భారతీయులకిలాంటి పద్ధతులు చిరపరిచితములు.

జైళ్లలో రాజకీయ ఖైదీలను హింసించితే వాళ్లు చేయదగినదేమిటి? ఉపవాసం కంటె మరొక గత్యంతరం లేదు. జతీంద్రనాథదాసు అలా ఉపవాసం చేసి విజయం సాధించాడు. చనిపోవటం కొరకు చేసే ప్రయత్నం ఆత్మహత్య అవుతుంది. అంతేగాని ఒకరి హృదయంలో పరివర్తన కలగటం కొరకు చేసే ఉపవాసంలో మరణమే గనుక పొందితే దానిని తపశ్చర్య అనవచ్చునేగాని ఆత్మహత్య అనటం చాలా పొరపాటు. ఇలాంటి ప్రధాన విషయం గూర్చి విద్యావంతుడయిన ఒక భారతీయునికి ఇలాంటి విపర్యభావం కలగటం శోచనీయం.

దేశంలో ఎన్నికల వ్యవహారం మహాజోరుగా వున్నది. నామినేషను దాఖలు చేయటమంటే పోస్టుబాక్సులో వుత్తరం రాసి పడవేయటం లాగ వున్నది! ఒక్కొక్క సీటుకు పదిమంది నిలబడుతున్నారాయె మార్కెట్టులో కూరలమ్మే వాళ్లు పిలిచినట్లు పిలుస్తారు కాబోలు ఓట్లు వేయండహో అని! పంజాబులో ఒక సీటుకే ఎనభైమంది నిలబడుతున్నారట. తలప్రాణం తోకకు వచ్చివుంటుంది ఆ రిటర్నింగు ఆఫీసరుకు!

అప్పుడే ఏమయింది! ఇంకా ముందున్నది ముసళ్ల పండుగ. అసలు డెమాక్రసీ అనేది నీతి కలిగి ప్రవర్తించే వారికొరకు మాత్రమే సుమా అని దాని ముఖానే వ్రాసివున్నది. నిశాని దారులూ, పాళీలు విరుగ గొట్టేవారికీ వోటు హక్కు ప్రసాదించుకున్నాం గనుక ఆ వ్రాత ఎవరికీ అంతుపట్టి వుండదు. అసలు దాన్నెవరూ చూచి గూడా వుండరు. మనలో చదువుకున్న వారికైనా డెమాక్రసీ పనిచేస్తుందా అనేది గూడా సందేహం.

ఇంత సందేహం ఎందుకు కలిగిందంటే రాజధానీ నగరంలోనే ఓట్ల గారడీ జరిగింది. కాంగ్రెసు ప్రెసిడెంటు అయిన మన ప్రధాన మంత్రిగారికీ విషయం ఎరిగిస్తే ముఖ్యమైన ఆరోపణలు ఆయనకు చేరనట్లుగా అభినయించి, కొన్ని బాలెట్ పెట్టెల కంతలు చిన్నవిగా వున్నవనే ఆరోపణను మాత్రం అంగీకరిస్తూ అలాంటి పెట్టెలు అన్ని పార్టీలవారికీ సమానంగా పంచిపెట్టమని సమాధానం చెప్పారు. కాంగ్రెసుకు అలాంటి పెట్టెలు ఎన్ని ఇవ్వబడినవో మాత్రం సెలవియ్యన లేదనుకోండి.

ఢిల్లీ మునిసిపల్ ఎన్నికల్లో జరిగిన ఇంద్రజాలం బయటికి పొక్కకుండా వుండదగినంత స్వల్పమైన దేమీ కాదు. ఒక్క కాంగ్రెసు అభ్యర్థి ఒకలక్ష రూపాయలు "మాత్రం" వ్యయం చేశాడు. ఒక నియోజకవర్గంలో ఇవ్వబడిన బాలెట్ కాగితాలకంటె పెట్టెల్లో పడిన కాగితాలు ఎక్కువయినవట! బహుశా పిల్లల్ని పెట్టివుంటాయి. మరొకచోట కాంగ్రెసుకు ఓటివ్వకపోతే శరణార్థుల సేవన్నా ఆపివేయబడుతాయని కేంద్రప్రభుత్వపు మంత్రులు వచ్చి బెదిరించారట. బహుశా మన మంత్రులకు కొట్టావద్దు తిట్టావద్దు అన్న సామెత బాగా వంటపట్టివుంటుంది. పోనీ లెండి. జనమేజయుడు సర్పయాగం చేస్తుంటే తక్షకుడు ఇంద్రుని సింహాసనం పట్టుకుని పాకులాడినట్లు దేశమంతటా కాంగ్రెసు యాగం జరుగుతుంటే రాజధానిలోనైనా ప్రతిష్ఠ నిలుపుకోవద్దు?

నిలబడుతున్న అభ్యర్థులు ప్రస్తుతం ఏదో పార్టీ పేరుతో నామినేషన్లు పడవేస్తున్నప్పటికీ తీరా శాసనసభలోకి అడుగుపెట్టేసరికి అప్పటి పరిస్థితులనుబట్టి వేషంమార్చుకొనేటట్లున్నారు. చివరకు శాసనసభ నాలుగు స్తంభాలాటగా తయారవుతుందేమో చెప్పలేం.

ప్రస్తుతం ఢిల్లీ మార్కెటులో వోటు వెల అయిదురూపాయలనుండి ఇరవై రూపాయలవరకు పలుకుతున్నది. స్త్రీల వోటు ధర ఒక "బెనారస్ చీర" అని తెలుస్తున్నది. మద్రాసు బొంబాయి కలకత్తా స్టాకుఎక్స్చేంజీలలో ధర ఎంత పలుకుతుందో మరొక నెలకు గాని తెలియదు.

స్కెచ్

# కూటి విద్యలు

యం. యస్. గోపాలమూర్తి

రత్తయ్యగారింట్లో ఆరోజు మహా హడావిడిగా వుంది. ముందు వాకిలి తలుపు, గొడ్లసావిడి పక్కనున్న గేటూ మూసి గట్టిగా బిగించారు. కూలీలిద్దరు దక్షిణపు గదిలో వున్న నాగలి, కాడి, మేడి వగైరా సావిట్లోకి చేరుస్తున్నారు. అవి తీయటం పూర్తికాగానే పలుగులు పెట్టి నాలుగు గోడలమధ్య ఒక్కొక్క గోడకు ఒక్కొక్క అడుగు దూరం విడిచి చదరంగా తవ్వటం మొదలెట్టారు. రత్తయ్య దగ్గరుండి స్వయంగా తవ్విస్తున్నాడు. రత్తయ్య ముసలితల్లి, పెళ్ళాము, కూతుళ్లు, చిన్నపిల్లలు చుట్టూ కూడారు. చిన్నపిల్లలు ముక్కుమీద వేలేసుకుని "అమ్మా యెందుకే గదిలో గొయ్యి తవ్వుతుండారు?" అని అడిగితే "అదె మిమ్మ మీ రెమ్మ మింగ, మీకెందుకురా ఆ జోలీ? చదవ్వాలు తిని బళ్లోకి పొండి" అని ఆ తల్లి సమాధాన మిచ్చింది. ఆ సమాధానం విని పిల్లలు నోరు కట్టేసుకున్నారు గొయ్యి బాగా నాలుగైదడుగులు లోతు తీసింతర్వాత రత్తయ్య అంతటితో ఆపుజేయించాడు తవ్వక "పాతర" గోడ పునాదుల కన్న రెండు మూడంగుళాలు కిందికి దిగటంచేత ఎట్టాపోయి ఎట్టా వస్తుందోనని "యిహ ఆపుచేయండిరా" అన్నాడు. పాలేగాళ్ళు కొట్టాంలోకి పోయి గడ్డి యెంట్లు తీసుకొచ్చి గోతిలో చుట్టూరా చుట్టారు. అడుగున మెత్తగా గడ్డివేసి చుట్టూ దిట్టంచేసి "యేమిసెలవు" అన్నట్లు చూశారు "పూత్తాకేంటిరా? గోతాలు తీసుకొచ్చి గుమ్మరించండి" అన్నాడు రత్తయ్య. వెంటనే వాళ్లు పంచపాళీలో వున్న వడ్ల గోతాలు వీపులమీద యెత్తుకొచ్చి గింజలన్నింటినీ "పాతర"లో పోసి మళ్ళా ఒక వరస గడ్డి కప్పారు. నేల బారుగా వుండేట్టు మన్ను కప్పారు. రత్తయ్య పెళ్ళాం సుబ్బరంగా అలికి ముగ్గులెట్టింది. ముసలమ్మ అక్కడ కాసేపు రాటంకూడా వడికింది.

రత్తయ్య ఆలోచనలో పడ్డాడు, "ఇంతవరకు అంతా బాగానే వుండది. లేకపోతే యీ నాలుగ్గోతాలు అట్లా నాక్కుపోతే సంవత్సరం పొడుగునా మేం తినేదెట్టా? జీతగాళ్ళకి గింజలు కొలిచేదెట్టా? ఏమోరా దేవుడా! ఈ మాయదారి పాక్కారుమంటు నాపాలిటికే రావాలీ? వచ్చే నెల్లో చిన్నదానికి పసుపు కుంకం చెయ్యవలసుండె. నిన్నగాక మొన్ననే గంటా ఎట్టాగో రిందామీదాపడి లెక్కప్రకారం తాసీల్దారుడికి గింజలప్పజెప్పితిని. మళ్ళీ ఇంతలో నేనా? హరి నీ తస్సగొయ్యా కాలవూ...!" ఇంట్లోంచి యేంటో గుసగుస వినబడతాంటే రత్తయ్య ఆలోచన ఆగింది. ఇంతట్లోకే పెద్ద కూతురు బయటికివచ్చి "యిట్టా లోపలికి రావే అయ్యా" అనింది. రత్తయ్య చుట్ట పారేసి లోపలికి వెళ్ళాడు. ఆడాళ్లు నలుగురూ చుట్టూతా చేరారు. అంతా ఒక్కమాటు గొణగొణమంటూ చెప్పటం సాగించారు. "ఓసి మీరట్టా వాగుతాంటే నాకు తెలియద్దాంటే? నువ్ చెప్పవే పెద్దమ్మాయ్" అన్నాడు రత్తయ్య "అది కాదే అయ్యా, అళ్లు వచ్చేటప్పుడు యెంబటే కర్రలు తీసుకొచ్చి నేలమీద పొడిచి సూత్తారంటే? బోలుమోత మోగితే తవ్వికూడా సూత్తారంట. గదిలో కర్రతో కొట్టి చూశాం బోలుమోత మోగుతుండది" అన్నది కూతురు.

రత్తయ్య కర్ర తీసుకుని గదిలోకిపోయి కాసేపటికి బయటికివచ్చి కర్ర నేలమీద పారేసి నుదురుపట్టుకుని కూలబడ్డాడు. కూతుళ్లు చుట్టూ చతికిలబడ్డారు. కాసేపు చేతులు కొట్టుకోవటాలు, బుగ్గలు నొక్కుకోవటాలు పూర్తి అయింతర్వాత పెద్దకూతురు మెరుపల్లే లేచి అయ్యచెవిలో నోరుబెట్టి గుసగుస మన్నది. రత్తయ్య ఒక్కమాటు పళ్ళన్నీ బయటపెట్టి కర్రతీసుకుని లేచి నుంచొని పెద్ద కూతురువంక

చూసి బలేబలే అన్నాడు.

మర్నాడు పొద్దున ఎనిమిది గంటలకు పొక్కారుమెంటు తాసీల్దారు ఊళ్లో అడుగు బెట్టాడు. కరణం, మునసబూ, కర్రలు పట్టుకుని వెట్టివాళ్ళు వెంటరాగా ఆయన యింటింటికి పోయి గదులు, వంటిళ్ళు, మచ్చులు, పెంటపోగులూ, వాములూ అన్నీ వెతుకుతూ, అనుమానం వేసినచోట కర్రతో పొడిచి చూస్తూ, బోలుమోత మోగితే వ్యవహారం యిన్స్పెక్టరుకు వదిలి; యిట్లా పరీక్షలు పూర్తిచేస్తూ మెల్లగా రామయ్య గారింటికి వెళ్ళాడు. రామయ్య 200 ఎకరాల ఆసామీ. ఆయనంతటివాడు ధాన్యం దాస్తాడా? అందుకని నడవలోకి మాత్రం పోయి నాలుగు గోడలకి తగిలించిన ఫోటోలు చూసి "ఎబ్బే మీ యింటి కీవిధంగా రావటం మహాపరాధం"అని రామయ్యగారితో కబుర్లాడి, అట్టా అట్టా రత్తయ్య యింటికి చేరారు.

చెదిరిపోయిన గుండెతో నడవలో పచార్లు చేస్తున్న రత్తయ్య గుమ్మానికి ఆనుకుని నుంచున్న పెళ్ళాం వంక ఒక్కమాటు చూసి, వెంటనే తాసీల్దారుడి కెదురుగా వెళ్ళాడు. లోపలికి గెంతిన రత్తయ్య భార్య దక్షిణపు గదిలోకి పోయి, "అల్లొచ్చారు. పండుకో. కాస్తంత గట్టిగా మూలుగు"అని మంచం మీద పండుకున్న పెద్దకూతురుకి పురమాయించింది. ఆమె వినే వాళ్ళ గుండెలు తరుక్కుపోయేటట్టు "ఊ" అని, "అమ్మా నొప్పి"అని, "అయ్యో బాధ"అని ఝూమ్మంటూ మూలగటం మొదలెట్టింది. "కాస్త జాగ్రత్తగా చూడవే వెంకాయా"అని ముసలమ్మ దీర్ఘాలు తీస్తూ చాకలి వెంకాయమ్మను అన్నట్లు అంది. గది తలుపులు దగ్గిరికి చేరేసి యివతల గోడకి చేరబడి నుంచున్న రత్తయ్య చిన్నకూతుళ్లు పమిట చెంగులతో కళ్లు వత్తుకుంటూ, ముక్కులు చీదటం సాగించారు.

జనాన్నంతటినీ బయట నిలిపి రెవిన్యూ ఇన్స్పెక్టరు, ఒక రైతు, రత్తయ్యా, లోపలికి వచ్చారు. వరండాలోనున్న గాదెలను కొట్టి చూశాడు యిన్స్పెక్టరు. ఒకటి గట్టిగా మోగింది. ఒకటి తడికెల మోత మోగింది.

"లెక్క ప్రకారం మీ కప్పజెప్పగా మిగిలిన వియ్యేనండి. ఇయ్యేడు పాడుగుతా మాకు చాలవండి"అన్నాడు రత్తయ్య. యిన్స్పెక్టరు బుర్ర దూపి లోపల అడుగు బెట్టాడు. లోపల అంతా మూలుగులూ, రోదనలూ, కళ్లు వొత్తుకోవటాలూ, ముక్కు చీదటాలూ అంతా చూస్తుంటే అగమ్యగోచరంగా కనిపించింది. "ఏమండీ అదీ" అని అడిగాడు రత్తయ్యను. "మా పెద్ద కూతురు నీళ్లు పోసుకునే రోజులండి. కష్ట పడతోంది. ఈ సంగతి మీకు బయట చెప్పినా నమ్మరని లోపలికి తీసుకొచ్చానండి. ఐతే అయిందిలెండి. మీరు తిక్కనచోటు చూడొచ్చు"అని గుండె దిగపట్టుకుని ఓంకంగా మాట్లాడాడు రత్తయ్య. ఆ యిన్స్పెక్టరొక అమాయకపు మనిషి. కచ్చితంగా యిటువంటివి కాకపోయినా వీటిని పోలినవి చాలా చూశాడు. అందుచేత కాస్త అనుమానించాడు. మధ్య యింట్లోనూ, వంటింట్లోనూ, దొడ్లోనూ, పాకట్లోనూ, కర్రతో నేలమీద పొడిచి చూశాడు. ఉహూం. పెంటపోగులోకి కర్ర బాగాపోనిచ్చి చూచాడు. ఆనవాలు చిక్కలా. మళ్ళా మధ్యగదిలోకి వచ్చి నిచ్చెన సాయంతో మచ్చుమీదికి యెక్కాడు. ఏమీ లేకపోవటం మూలాన ఉత్తచేతులతో దిగి రావట మెందుకని తలనిండా, ఒంటినిండా బూజు మాత్రం ధరించి దిగి వచ్చాడు. అయినా అతనికి ఆ గదిమీదే అనుమానం. తటపటాయిస్తూ నుంచున్నాడు. గది గుమ్మానానుకొని యిదంతా చూస్తున్న రత్తయ్య చిన్న కూతుళ్లు యిప్పుడు కాస్త గట్టిగా చీదటం సాగించారు. ముసలమ్మ దీర్ఘాలు మొదలెట్టింది. రత్తయ్య పెద్ద కూతురు ఒక్కమాటు "అమ్మో" అనింది. "మగపిల్లాడు. మగపిల్లాడు" అని రత్తయ్య భార్య అరిచింది. తుపాకీతో కొట్టినట్లు రెవిన్యూ యిన్స్పెక్టరు వాకిట్లోకి గెంతు పెట్టాడు. ధాన్యం పట్టుకున్నా పట్టుకోకపోయినా ఒంటినిండా బూజుతో మాత్రం బయటికి వచ్చిన యిన్స్పెక్టరును చూచిన తాసీల్దారు, మిగతా జనం విరగబడి నవ్వుతూ పక్కయింటికి దారితీశారు. ఈనవ్వులో రత్తయ్య ఇంట్లోంచివచ్చిన తమాషా నవ్వు కలిసిపోయి గాలికి కొట్టుకుపోయింది.

స్కెచ్

# అపహరణ

బులుసు-జీ-ప్రకాశ్

ప్రయాణికులు మాత్రమే కూర్చుండుటకు—

అనే ఆ చిన్న మూడవక్లాసు కంపార్టుమెంటులో నేను కూర్చున్నా. నా కెదురుగా ఇద్దరంటే ఇద్దరే వ్యక్తులు కూర్చున్నారు. మొదటి వ్యక్తి మాత్రం నన్ను చూసీ చూడ్డంతోనే ఆకర్షించాడు. చక్కని షేంటూ, షేంటులో దోపుగాని షర్టు కాలికి బూటు, టిప్‌టాప్‌గా ఉన్నాడు. చేతి రుమాలు తీసి, మొహానికి చెమటపట్టకపోయినా, తుడుచుకుంటున్నాడు. గాలివల్ల జుత్తు ఫాలభాగంపై పడుతుంటే జుత్తును మీది కెగ త్రోస్తున్నాడు. నల్లని చలవ కళ్ళద్దాలుకూడా తాను అలంకరించుకున్న సరుకుల్లో ఒకటి. ఆ కళ్ళద్దాలు తీస్తూ తన కళ్ళను నలుపుకుంటూ మళ్ళీ కళ్ళద్దాలు ధరిస్తున్నాడు.

ఇంక రెండో వ్యక్తి ఒక మోస్తరుగా ముదుసలి అని చెప్పక తీరదు. అతని సంగతి చెప్పాలంటే మొదటి వ్యక్తికంతా వ్యతిరేకం. చాలా బద్ధకస్థునిలా వున్నాడు. పైమీద వోణీ వేసుకుని కునుకుపాట్లు పడుతున్నాడు. తన గెడ్డం క్రింద రెండు కన్నీటి మరకలున్నాయ్. ఎంచేతో నా కర్థంకాలేదు! అంతా నిశ్శబ్దం.

"అబ్బ! ఎంత హీట్‌గావుంది. వేసవికాలం ప్రారంభమైంది కాబోలు. ఈ వెధవ ట్రెయిను కూడా మందగమనం సాగిస్తోంది" అంటూ నిశ్శబ్దాన్ని ఛేల్చివేశాడు, ఆ షోకిల్లా.

అతని మాటలు వినగానే నేనా ముదుసలి వైపు చూశాను నా కేమైనా సమాధానం యిస్తాడేమోనని. కానీ, అబ్బే! అఘటం వాటం చూస్తే జవాబిచ్చేటట్టు లేదు. ఇక జవాబివ్వడం నా వంతని అనుకున్నాను—

"నిజమే! చీకటికొంపలో కూర్చున్నామా అన్నట్లుంది."

"అసలీ ప్రపంచమంతా చీకటి! ఒక్క కంపార్టుమెంటే అనడమెందుకు?" అని ఊరుకుంటాడేమో అనుకున్నా. కానీ మళ్ళీ అన్నాడు కొద్ది ఆశ్చర్యంతో—"ఆఁ! అన్నట్లు మరచాను. మనపేర్లు ఒకసారి ఒకళ్ళకొకళ్ళు చెప్పుకుందాం. మీపేరు?" అనగానే పేరు చెప్పాను.

"నా పేరు సూర్యమోహన్. నేను మామూలు ప్రయాణీకుణ్ణే. విజ్ఞానంకోసం దేశసంచారం చేస్తున్నాను" అంటూ చిరునవ్వు నవ్వాడు.

నేనా ముదుసలివైపు చూశాను, తన పేరు చెప్తాడేమోనని- కానీ లాభం లేకపోయింది. అతను మా యిద్దరికీ సంపూర్తిగా వ్యతిరేక మూర్తి!

తను జేబులోంచి మనీపర్సు తీసి, విప్పి ముద్దు పెట్టేసుకుంటున్నా డెందుకూ! సూర్యమోహన్ ఇది చూసి—"చూశారా వాడు! నూరు రూపాయల నోటుని ముద్దెట్టుకున్నాడు. లోభి!" అని పకపకా నవ్వాడు. సూర్యమోహన్ చెప్పిందాట్లో అబద్ధమేమీ లేదని నేను మౌనముద్ర వహించాను.

"ప్రపంచం గుడ్డిదని చెప్పడంలో అబద్ధమేమీ లేదు." సూర్యమోహన్ సంభాషణను లంకించుకున్నాడు—"పూర్తిగా పాడైంది వెధవ ప్రపంచం! ప్రతి విషయంలోనూ, ప్రతి వ్యక్తిలోనూ, ఏదో లొసుగుంటున్నది. మానవజన్మ దేవుడు చేసిన పొరపాట్లలో మొదటిది. దేవుడు వెర్రివాడు! కాకపోతే ఇటువంటి పిసినారి వెధవల్ని, దొంగవెధవల్నీ సృష్టించమన్నదెవరు?" అంటూ వేదాంతం చెప్పుకుపోయాడు. అన్నీ నేను బుద్ధిగా చక్కా వింటూ తలూపాను.

ఇంతలో ముసలాయన పర్సును ప్రక్కకు పెట్టేసి గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. అస్తమిస్తున్న అరుణుడి కొనకిరణాలు కిటికీలోంచి కంపార్టుమెంటులోకి ప్రసరిస్తున్నాయ్. రైలు భయంగా పరుగెడుతోంది.

"డబ్బుకంటే విలువైన దీ జగత్తులో మరో

కటి లేనట్లుంది." సూర్యమోహన్ సంభావనలో నిమగ్నుడయ్యాడు- "అయినా చూడండి. ఆ లోభి తన పర్సుమీద ఎట్లా చెయ్యి వేశాడో! మనం, ఈ బుర్రలేని మానవులం ఎప్పుడూ మంచివాళ్ళం కాలేరం. నూటికి తొంభై తొమ్మండుగురు ప్రపంచంలో వెర్రి వాళ్ళుంటే ఆశ్చర్యమేముందీ?" అన్నాడు.

ఇంతలో ముసలాయన పర్సు క్రిందికి పడింది.

నేను సూర్యమోహన్ మాటలకి జవాబు చెప్పేలోగా మళ్ళీ అతనంటున్నాడు—"ఆఁ! ప్రకాశ్ గారూ! నేనొక మంచి ప్లాను వేశాను. మనం ఆ పర్సు తీసి దాచేద్దాం. తను లేచి ఏం చేస్తాడో చూద్దాం!"

నేను సూర్యమోహన్ చెప్పినదానికి అంగీకరిస్తూ నేనే ఆ పర్సును తీసి దాచేద్దామనుకున్నా. కానీ ఆ పర్సు నాకన్నా ముందుగానే సూర్యమోహన్ చేతిలోకి ప్రవేశించింది.

అప్పటికి అప్పుడే నా కళ్ళు ముడతలు పడుతున్నాయ్. నిద్రాదేవి బంధించ యత్నిస్తూంది. "అయ్యా! ఓ గడియ పడుకుంటూనండీ! గాఢంగా నిద్ర వస్తోంది" అన్నాను. సూర్యమోహన్ చిన్ననవ్వు నవ్వాడు.

ఒక్క ఘనమైన కునుకు తీశాను. కళ్ళు నలుముకుంటూ విప్పాను. అయ్యో! మహేశ్వరా! సూర్యమోహన్ ఏమయ్యాడు? గాభరా పడిపోయాను. అప్పటికప్పుడే ఆ ముసలి లేచి వున్నాడు. అతను నెమ్మదిగా అడిగాడు:

"నాయనా! నా మనీపర్సుగాని ఇక్కడెక్కడైనా చూశావా? పోయినట్లుంది!"

నా శరీరంలో రక్తపు చుక్క లేదు. కొయ్యబారిపోయాను. సూర్యమోహన్, ఆ పెద్దమనిషి ఆ వేదాంతి, ఆ పర్సును అపహరించేడు! కొంప తీసి ఆయన దొంగతనం నామీద పెట్టి పళ్లు రాలగొడతా డనుకున్నాను.

కాని హఠాత్తుగా అతనొక చంటి పిల్లాడిలా ఏడవడం మొదలెట్టాడు. అతని వ్యక్తిత్వం, అతని స్వరూపం చూడగానే నా హృదయం కరిగిపోయింది. అతనిని రోదనని ఆపడానికి ప్రయత్నం చేశాను.

"మీకే అవసరమున్నా, నేను తీర్చగలను. నేను మీకు కావలసినంత ధనసహాయం చేస్తాను. క్షమించండి! మీ పర్సును అపహరించింది నేను కాదు" అన్నాను.

"నాయనా! నేను డబ్బును దాచి లోభి వలె ముద్దు పెట్టుకునే రోజులుగడిచిపోయాయి. ప్రస్తుతం నేను వృద్ధుణ్ణి.

"ఆ పర్సులో ఏముందో తెలుసా! నూరు రూపాయల నోటుందని కదూ నీకు సూర్యమోహన్ చెప్పాడు? ఒక్క కానీ కూడా లేదు. ఏదీ నాకది పరమేశ్వరు డివ్వందే? కానీ ప్రపంచంలో ఒక అమూల్యమైన వస్తువు ఒక్కటుంది. అదే నా హృదయసీమ!"

శిలా ప్రతిమలా అతనట్లా కూర్చుని విచారంగా ముఖం పెట్టాడు. మళ్ళీ అతను చిన్న శోక స్వరంతో చెప్పడం మొదలు పెట్టాడు.

"నా ఏడేళ్ళ కూతురు మృదుల... నన్ను విడిచి మొన్ననే ఒక వెలుగు జగతిలోకి ప్రవేశించింది. ఆమె ఒక్కతే... లోకంలో నాతో సంబంధం గల వ్యక్తి."

అతని మాటలు వింటూ, అతని ముఖ వర్ఛస్సును తదేక దీక్షతో పరికిస్తున్నందువల్ల నా కంటి నుండి బాష్పాలు రాలాయ్. పాపం, అతను నా కంటి బిందువులు తుడుస్తూ,

"ఫర్వాలేదు. దీనికంతటికీ కారకుడువి నీవు కాదు. ఆ ఫోటో పోయిందని నాకు మాత్రం విచారం అనుకున్నావా? నా వద్దను మరొక ఫోటో వుంది నాయనా. అది నా హృదయం లోనే వుంది. నా మృదుల నా హృదయం లోనే వుంది. నా మృదులను నా హృదయం లోంచి గజదొంగలైనా సరే అపహరించలేరు! అపహరించలేరు! హరహర మహాశివ్!..."

స్టేషనులో బండి ఆగింది. అతను తన సామాను సర్దుకుని, "వస్తాను బాబూ! పరమేశ్వరుడు నిన్ను రక్షిస్తాడు" అన్నాడు.

అతను స్టేషన్ దాటి అవతలకెళ్ళి తిన్నగా రోడ్డుమీదం నడక సాగిస్తున్నాడు. అతను నా కంటికి అవుపించేదాకా, అతన్ని తదేకదృష్టితో చూస్తున్నాను. అంతలో అతను మాయమయ్యాడు.

మళ్లీ నా కళ్ళనుండి నాలుగు జల బిందువులు రాలాయ్! కళ్లు మూసుకుని పరమశివుని ధ్యానించాను.

# చిరంజీవి మరుపు

(కథానిక)

బయలు దేరేటప్పుడే అనుకున్నాడు చిరంజీవి తను ఏదో వస్తువు మరిచిపోయానని. చిరంజీవికి యిది అలవాటే. ఏదయినా ప్రయాణం పెట్టుకున్నప్పుడు ఏదో ఒక అవసరమయిన వస్తువు మరిచిపోతూ వుంటాడు. అందులోనూ యిది మామగారి ప్రయాణం కాదాయె వెళ్ళేది అత్తవారింటికి.

తను ఏదో వస్తువు మరిచిపోయాడని గట్టిగా నమ్మాడు చిరంజీవి. కాని ఆ మరిచిపోయిన వస్తువేమిటో ఎంత ఆలోచించినా తేలలేదు. ఒకసారి కట్టిన హోల్డింగ్‌ని అంతా విప్పదీసి పరిశోధన చేశాడు. హెయిర్ ఆయిల్, ఫేస్ పౌడరు, కళ్ళజోడు, కూలింగ్ గ్లాసెస్ అన్నీ చెక్కు చెదరకుండా వున్నాయి. తను తరుచుగా మరిచిపోతూవుంటే టూత్ పేస్టు కూడ వున్నది. మరి తను మరిచిపోయిందేమిటి?

ఆలోచనలతో అంతుపట్టక అలాగే బయలుదేరాడు చిరంజీవి. ఒకవేళ తను పర్సుగాని మరిచిపోలేదుగదా! అని చూసుకున్నాడు. భద్రంగా వున్నది. చేతి గడియారం కనిపిస్తూనే వుంది. పోనీలే అని మిత్రులవద్ద సెలవు తీసుకుని బయలుదేరాడు. దారిపొడుగునా రైల్లో కూడా ఇదే ఆలోచన. తను ఏదో మరిచిపోయాడు. అది ఏదో తెలియకపోయినా తప్పక తన కొంప ముంచుతుంది. ఒకసారిలాగే పెళ్ళికి వెళ్తూ టవల్ తీసుకువెళ్ళటం మరిచిపోయాడు. ఆ పెళ్ళి హడావుడిలో తన గోడు ఎవరు చూస్తారు? స్నేహితుడిని బ్రతిమాలి అప్పటికి తన అవసరం గడుపుకున్నాడు. అన్నట్టు తను తువ్వాలు తీసుకువెళ్తున్నాడా? దాన్ని జాగ్రత్తగా బట్టలతోపాటు పెట్టినట్లు చిరంజీవికి గుర్తు వచ్చింది. ఈ ఆలోచనలలోనుండి బయటపడదామని ఎంత కొట్టుకుంటున్నా మనస్సు మళ్ళీ దానిమీదికే పోతున్నది.

ఆలోచనలతోనే అత్తవారి వూరు చేరాడు. స్టేషన్‌కి తనకోసం ఎవరయినా రావాలి. సామాను ప్లాటుఫారంలో దింపుకుని అంతా పరకాయించి చూశాడు. ఎవరూ రాలేదు తనకోసం. చిరంజీవికి కొంచెం మండింది. కాని తను యిక్కడికి ఎన్నిసార్లు వచ్చాడు? చాలాసార్లు. అందుకే ఎవరూ రాలేదు. ఎవరయినా ఎన్నిసార్లు వస్తారు? మొదట్లో వస్తారు అల్లుడిని ఆహ్వానించటానికి. తర్వాత ఆ అలవాటు మారిపోతుంది.

చిరంజీవి యిలా సమాధానపడి అత్తవార్లు చేరాడు. తనను గుమ్మంలోనే చూచిన మరదలు పిల్ల లోపలికి తుర్రుమంది. బండివాడికి డబ్బులిచ్చి పంపేసి లోపలికి అడుగువేశాడు.

"ఏమోయి, కులాసాగా వున్నావా?" అత్తగారు అడిగింది.

చిరంజీవి ఏదో యుక్తసరిగా సమాధానం చెప్పాడు.

"కాళ్ళు కడుక్కో నాయనా. ఇదేమిటి? ఇంకా నీళ్ళివ్వలేదమ్మా అమ్మాయి! బావకి నీళ్ళు తెచ్చి యియ్యమ్మా!" అని కేకవేసింది అత్తగారు. మరదలు వసంత నీళ్ళు తెచ్చియిచ్చింది. చిరంజీవి తను వేసుకున్న బూట్లు విప్పి కాళ్ళు కడుక్కుని గదిలోకి పోయాడు.

పన్నెండింటికి మామగారు వచ్చాడు. అప్పటిదాకా చిరంజీవి భోజనం చేయకుండా ఆయన కోసం కనిపెట్టుకు కూర్చున్నాడు. మధ్యాహ్నం భోజనాలు అయినాయి. చిరంజీవికి నిద్ర తూలుకువస్తున్నది. తన గదిలోకిపోయి ప్రక్కమీద పడుకున్నాడు. హాయిగా నిద్ర పట్టింది.

మూడింటికిగాని మెలకువరాలేదు చిరంజీవికి. లేచి అటూయిటూ దొర్లాడు. తను మరిచిపోయిన వస్తువునుగురించి ఆలోచనలు రాసాగాయి. విసుగుపుట్టి వాటిని బలవంతంగా దూరానికి తోసేశాడు. చిరంజీవికి ఎందుకో కొంచెం

కొమ్మూరి వేణుగోపాలరావు

చిరాకు కల్గింది అంతే. ఇక్కడికి వచ్చేవరకే ఆ తహతహ. తీరా వచ్చిన తర్వాత స్వంత యింట్లో వున్నహాయి మరెక్కడా వుండదు! అతనికి చాలా సార్లు యిలాగే ఐంది. వెళ్ళేదాకా వుబలాటం, తర్వాత విసుగు. మళ్ళీ అక్కడినుంచి వచ్చేసిన తర్వాత యెందుకొచ్చేశామా అని విచారం.

చిరంజీవికి యింకా ఆమె కనిపించలేదు. మొదట్లో మాట్లాడటానికి భిడియపడేవాడు. కాని తనస్నేహితుడు గోపాలం అతనిభార్యతో అత్తగారి ముందే నిర్భయంగా మాట్లాడతాడని తెలిసేటప్పటికి తనుకూడా మాట్లాడడం నేర్చుకున్నాడు. అంత అమర్యాదగా అత్తగారి ముందు మాట్లాడకపోయినా యెప్పుడో వీలు చూసుకుని పలకరిస్తూ వుండేవాడు.

చిరంజీవి యిక్కడికి వచ్చిన తర్వాత ఇంకా ఆవిడగారు ముఖం చూపించలేదు. చివరికి ఏమి తోచక ప్రక్కన కిటికీలో పడేసివున్న ప్లేయింగుబాక్సు తీసి దానితో కుస్తీ పట్టసాగాడు.

గది అవతల గాజులు గలగలమన్నయ్. చిరంజీవి వులిక్కిపడి ద్వారంవేపు చూడసాగాడు. శారద వెండి పళ్ళెంలో ఫలహారం, మంచినీళ్ళ గ్లాసు పట్టుకువచ్చి అతని ముందు పెట్టి తలవంచుకుని నిలబడింది.

"అబ్బో చాలా చేశావే. అయినా పొద్దున్ననగా వస్తే యింతవరకూ రాణిగారి దర్శనం లేదన్నమాట" అన్నాడు తన చలాకీతనానికి తనే గర్వపడుతూ.

శారద మాట్లాడలేదు. కనీసం ఏమి మాట్లాడాలో కూడా తోచలేదు.

"కులాసాగా వుంటున్నావా?" మైసూరుపాకు రుచి చూస్తూ అన్నాడు.

"ఊఁ"

"ఏం, పలికితే ముత్యాలు రాలిపోతాయా ఏమిటి? మొన్న వుత్తరం రాస్తే జవాబు కూడ రాశారు కాదేమండీ?" అతనిలో చలాకీతనం హెచ్చసాగింది.

"ఎందుకు? యెలాగూ వస్తున్నారుగా!"

"సరేలే. చదువుకుంటున్నావా బాగా?"

శారద స్కూల్ ఫైనల్ చదువుతూంది.

"ఊఁ"

చిరంజీవికి యింకేం మాట్లాడాలో తోచక పళ్ళెం ఖాళీ చేయసాగాడు. అతను మొదట్లో సిగ్గుపడేవాడు గాని యిప్పుడు పెట్టిందంతా తినటం నేర్చుకున్నాడు.

"కాఫీ తీసుకువస్తా" అంటూ శారద లోపలికి వెళ్ళిపోయింది.

చిరంజీవి యీలోగా పళ్ళెం ఖాళీ చేసేసి యిన్ని మంచినీళ్లు త్రాగేశాడు. అతనికి ఛటుక్కున తట్టింది. శారద చిక్కిపోయింది. అవును ఆమె బాగా చిక్కిపోయింది.

శారద కాఫీ తీసుకువచ్చింది. చిరంజీవి గ్లాసు అందుకుని "ఇలా చిక్కిపోయావేం శారూ!" అని అడిగాడు.

ఆ విధంగా పిలవటం యీ మధ్యనే నేర్చుకున్నాడు నవలల్లో చదివి. ఆమె కొంచెం నవ్వి వూరుకుంది.

"రాత్రిళ్లు చదువుతున్నావా?"

"ఊఁ"

చిరంజీవి అదిరిపడ్డాడు. అతిగా రాత్రిళ్లు చదివి ఆరోగ్యం పాడుచేసుకుంది. తను ఇప్పుడు బి.ఎస్.సి. చదువుతున్నా రాత్రి పదింటికన్నా యెక్కువగా మేలుకోలేడు. సెకండు షో సినిమాకి కూడా వెళ్ళలేడు.

"ఛా. అదేమిటి పరీక్షలు యింకా నాలుగు నెలలున్నాయి. అంత కష్టపడి చదవటమెందుకూ" అన్నాడు.

శారద ఏంమాట్లాడలేదు. కాని ఏదో అడుగుదామని యిందాకటినుంచి ప్రయత్నం చేస్తోంది. "నాకు పండక్కి ఏం తెచ్చారు?"

చిరంజీవి "చాలా మంచిదే తెచ్చా" అందామనుకుని ఒక్కసారిగా తృళ్ళిపడ్డాడు. తను ఒక వస్తువు మరిచిపోయాడు ఎంత ఆలోచించినా అదేమిటో తెలియలేదు. కాని అదేమిటి? "క్రొత్తచీర" యిప్పుడు తెలిసింది. తనూ ఆ బెడ్డింగ్ లో చుట్టబెట్టినట్లు గుర్తు. కాని వుదయం అదంతా తీసి వెతికినప్పుడు కనిపించలేదు. బహుశా అది ఆలమారాలోనే పెట్టి మరిచిపోయి వుండాలి. తను యెంత తెలివితక్కువ పని చేశాడు!

చిరంజీవి తెల్లమొహం వేయటం కనిపెట్టి శారద తెల్లబోయి చూడసాగింది.

"అరె. మరిచిపోయాను శారూ" అన్నాడు చివరికి. శారద ముఖం వాడిపోయింది. చెక్కిళ్లు ఎర్రబడ్డాయి.

"అది కాదు శారూ! అది కొని తీసుకు రావటం మరిచిపోయాను. నువ్వు క్రిందటిసారి అడిగినటువంటి చీరే కొన్నాను" అన్నాడు అదేమాదిరిగా.

కాని శారద ఎలా నమ్ముతుంది? అది మరిచిపోవటానికి ఏమైనా పెన్నా? పెన్సిలా? తన భర్త డబ్బు ఖర్చయి పోతుందనో, యిష్టం లేకనో తీసుకురాలేదు.

"కోపం వచ్చిందా శారూ!"

శారద గిరుక్కుమని తిరిగి వెళ్ళిపోయింది. చిరంజీవి తెల్లబోయాడు. నిజానికి ఆమెకు కోపం రావటంలో తప్పేమీ లేదు. క్రిందటిసారి గూడా తనేమీ తీసుకురాలేదు. చిరంజీవికి తనమీద తనకే కోపం వచ్చింది. తను అది ఎందుకు మరిచిపోవాలి? పోనీ అతని అలవాటు ప్రకారం మరిచిపోయాడు. తనకంత విఘాతం కలిగించే క్రొత్తగ మరిచిపోవలసి వచ్చిందే? ఏ స్నో పౌడరో ఎందుకు మరిచిపోకూడదు?

చిరంజీవి ఆ చీరను ముప్ఫయి అయిదు రూపాయలు వెచ్చించి తీసుకొన్నాడు అయితే ఏంలాభం? శారద కోపానికి గురికాకుండా తప్పించుకోలేక పోయాడు.

చిరంజీవి లేచి తల దువ్వుకోసాగాడు. వసంత వచ్చి "మొహం కడుక్కో బావా. నీళ్లు పెట్టాను" అన్నది. నిజానికి ఆ మాట శారద అనవలసింది.

చిరంజీవి వెళ్ళి ముఖం కడుక్కు వచ్చాడు. ఏదన్నా సినిమాకి వెళ్ళామనుకొన్నా బుద్ధి పుట్టలేదు. సరే నాలుగు వీధులూ అలా తిరిగి వద్దామని బట్టలు వేసుకుని బయలుదేరాడు.

అతను మళ్లీ యింటికి వచ్చేటప్పటికి ఏడున్నరయింది. మామగారు వాకిట్లో కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నారు. ఆయన మనిషి నవనాగరికుడయినా యిదో దురలవాటు.

"ఎక్కడికి పోయావోయ్?" గుప్పున పొగ వదుల్తూ అడిగాడు.

"ఆఁ వూరికినే అలా తిరిగి వచ్చానండి" అని చెప్పి గదిలోకి వెళ్ళాడు. వెళ్ళి బట్టలు మార్చుకునేటప్పటికి మరదలు పిల్ల వచ్చి "అన్నం వడ్డించారు. రా బావా!" అన్నది. చిరంజీవికి కొంచెం చిరాకు కలిగింది. "మాటి మాటికీ యీ పిల్ల వచ్చి అడగట మేమిటి. శారద రారాదూ?" అనుకున్నాడు.

భోజనాలదగ్గర మామగారు ఏమేమిటో చెప్పుకు పోతున్నాడు. ఆయన మాట్లాడే దాంట్లో ఎన్నికల దగ్గర్నుంచీ కొరియా యుద్ధం వరకు అన్ని సంగతులూ దొర్లి పోతున్నయి. అసలు చిరంజీవి యిలాటి విషయాల్లో ప్రతి దాన్నీ ఖండించి వాదించే స్వభావం. కాని యివాళ మనసు బాగా లేకపోవటంవల్ల కిమ్మనకుండా వూరుకున్నాడు. ఎదుటివాడు మాట్లాడకుండా వూరుకుంటే ఆయన యెంతసేపని వాగుతాడు? నోరు నొప్పెట్టి కొంతసేపటికి ఆయన కూడా వూరుకున్నాడు.

భోజనమయింతర్వాత చెయ్యి కడుక్కునేందుకు పెరట్లోకి వెళ్ళాడు చిరంజీవి. అప్పుడే శారద భావిదగ్గర్నుంచి లోపలికి వస్తున్నది. ఎవ్వరూ లేకపోవటం కనిపెట్టి "అరు శారూ!" అన్నాడు.

ఆమె ఆగిపోయింది.

తను ముప్ఫయి అయిదు రూపాయలు పెట్టి నిజంగా చీర కొన్నాడని, పొరపాటు చేత తేలేదని, అందులో అతని తప్పు ఎక్కువ లేదనీ నచ్చచెప్పబోతున్నాడు.

"అది కాదు శారూ!..."

ఏది కాదు? అతను మొదలు పెట్టేసరికే శారద లోపలికి వెళ్ళిపోయింది. చిరంజీవి తెల్లపోయాడు. యింకా అతనికి కోపం రాలేదు. పాపం శారద అమాయకురాలు అని జాలిపడి చెయ్యి కడుక్కుని లోపలికి వెళ్ళిపోయాడు.

అంతే. మరునాటి వుదయం శారద కనిపించనే లేదు. ఏపని కావలసి వచ్చినా మరదలు పిల్ల తైతక్కలాడుతూ తయారయ్యేది. చిరంజీవికి చెడ్డ విసుగు కలిగేది.

ఆ రోజు మధ్యాహ్నం వసంత కాఫీ తెచ్చినప్పుడు "మీ అక్కయ్య తెచ్చియియ్యలేదా?" అని అడిగాడు.

"ఏమో. యివ్వనంది" అందిమూతి తిప్పుతూ ఆ పిల్ల.

"అలాగా? ఏం?"

"కోపం వచ్చింది కాబోలు. నాకేం తెలుసు. అన్నీ నన్నే యిచ్చి రమ్మంది."

"ఆవిడగారికి ఏమొచ్చిందేమిటి? నీతో ఏమయినా చెప్పిందా?" అని అడిగాడు శాంతంగానే.

"ఏమో బావా. నాతోం ఏం చెప్పలేదు" అని వెళ్ళిపోయింది.

"సరే" అనుకున్నాడు చిరంజీవి. అతనికిప్పుడు బాగా మండింది. తను ఎవరికోసం వచ్చాడిక్కడికి. మరదలు పిల్లతో సరసాలాడటానికా? అత్త మామలతో కబుర్లు చెప్పటానికా? మరి ఆటువంటిది ఎందుకీ కోపతాపాలు. నిజంగా చిరంజీవికి యిక్కడనుంచి వెళ్ళిపోవాలని బుద్ధి పుట్టింది. కాని మామగారేమనుకుంటారో అనే భయంచేత మరో రెండు రోజులు గడపదలిచాడు.

అయినా చిరంజీవికి యింకా ఆశ పూర్తిగా చావలేదు. ఒకవేళ చీర ఏమయినా బెడ్డింగులో వుంచిందేమోనని మళ్ళీ యింకోసారి వెదికాడు. అది వుంటేగా!

చిరంజీవి ఎలా అయితేనేం మరో మూడు రోజులు నెట్టుకొచ్చాడు. నెట్టుకొచ్చాడే గాని దిగులుగానే గడిపాడు. సరదాగా గడుపుదామని వస్తే యిలాగయితే దిగులెందుకు వుండదు.

ఆరోజు భోజనాలు చేస్తుండగా యీ విషయం ఎత్తాడు. మామగారు తెల్లబోయి "అదేమిటోయ్. నువ్వు వచ్చి నాలుగు రోజులే కదోయి. మరో నాలుగు రోజులు వుండవచ్చు" అన్నాడు.

"అవ్వేలేవండి. పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. చదువుకోవాలి" అన్నాడు.

"అదేమిటి నాయనా? పెద్దపండుగ నిన్నగదా అయింది. అప్పుడేనా?" అంది.

"చదువుకోవాలండీ. కష్టం" అని తెల్లిగా వసిగాడు చిరంజీవి.

మామగారు, అత్తగారు చేతనయినంతవరకూ బ్రతిమిలాడారు. పాపం వాళ్ళకి యీ తగాదా విషయం తెలియదు. వాళ్ళు ఎంత చెప్పినా చిరంజీవి అంగీకరించక ఆ సాయంత్రం ప్రయాణమై వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు.

ఈ సంభాషణ అంతా వింటున్న శారద చలించలేదు. పోతేపోనియ్యి అనుకుంది. ఆమెకు నిజంగా అంత కోపంగా వుంది భర్తమీద. సావిత్రి భర్త ఆమెకి రిస్టువాచి కొనిచ్చాడు. చక్కగా వుంది. ఆమె అతి గర్వంగా చూపిస్తుంటే తనకెంత చిన్నతనం వేసింది?

ఆ సాయంత్రం చిరంజీవి ప్రయాణం కట్టాడు. అప్పుడు ఒకవేళ శారద వచ్చి పలకరించినా పలకకూడదనుకున్నాడు. మామగారు స్టేషన్ దాకా వచ్చి దిగబెట్టి వెళ్ళాడు. చిరంజీవికి మండిపోయింది. ఆఖరికి వెళ్ళిపోతున్నప్పుడన్నా వచ్చి మాట్లాడించలేదని తెగని కోపంగా వుంది.

చిరంజీవి బండిలోంచి దిగంగానే తండ్రి ఆశ్చర్యపోయి "అదేమిట్రా అప్పుడే వచ్చేశావు" అని అడిగాడు.

"ఇంట్లో బాగుండలేదు నాన్నా" అని గొణిగాడు చిరంజీవి.

ఇంట్లో ప్రవేశించంగానే అందరూ అలానే ప్రశ్నించేసరికి చిరంజీవికి చిరాకు కల్గింది. గట్టిగా కసురుకుని గబగబా గదిలోకి పోయాడు. అలమారా తలుపులు తీసే వున్నాయి. కాని అందులో చీర మాత్రం కనిపించలేదు. చిరంజీవి విస్తుపోయాడు. అతనికి మరుక్షణ ఒక విషయం గుర్తుకు వచ్చింది. ఒకవేళ తనచెల్లెలు తీసిందేమో. దానికెప్పుడూ యివే పనులు. వెంటనే చెల్లెల్ని పిలిచాడు.

జానకి వచ్చింది "ఎందుకన్నయ్యా పిలిచావు" అంటూ.

"అవునుగాని యీ అలమారాలో చీర పెట్టాను. నువ్వుగాని తీశావా?" అని అడిగాడు.

"నాకేం తెలుసు? అసలు చీరేమిటి?" అని అడిగింది జానకి.

"సరేలే. అవతలకినడు" అనికసురుకున్నాడు.

మరునాడు ఆ బెడ్డింగంతా సర్దుకుంటున్నాడు చిరంజీవి. పరుపు అడుగునుంచి ఏదో తళుక్కుమని తొంగిచూసింది. కోపంతో బయటికి లాగి చూశాడు. తను భార్యకోసం ముప్ఫై అయిదురూపాయిలు పెట్టి కొన్న చీర. తనతో కూడా అత్తవారింటికి వెళ్ళి మళ్ళీ తనతోనే వచ్చేసింది.

మన పాటల సంపద

# ఆటల పాటలు

దేవులపల్లి కృష్ణశాస్త్రి

పాట మానవుడికి మహా సహజంగా వస్తుంది. పాటలేని బ్రతుకులేదు. బ్రతుకుదారి పొడుగునా, అక్కడక్కడ ఒక చెట్టులాగా—ఇక్కడక్కడ ఒక ఏరులాగా పాట తగుల్తూనే ఉంటుంది. పాట పైనుంచి తెచ్చిపెట్టుకున్నది కాదు. లోపల్నుంచి ఉబికి ఉబికి ఉరకలు వేసి వచ్చేది. బ్రతుకులో పాటకోసం మనం ఎదురు చూడం. అనుకోకుండా వచ్చే అతిథి వంటిది. పాట. ఊత, ఊపు, ఊరట, ఉల్లాసము, ఉత్సాహము—ఎన్నో అనుభూతులు మానవుని బ్రతుకులో ఈ పాట. మొట్ట మొదట మానవులెవ్వరో ఆడమ్ ఈవ్—అదితి కశ్యపులో—ఎవ్వరో పాటతోటే ఈ లోకయాత్ర ప్రారంభించి ఉంటారు.

దేశదేశాల్లో రకరకాల జాతుల మానవులున్నారు. వాళ్ళల్లో స్త్రీ పురుషులున్నారు. వాళ్ళల్లో పాపలూ పిన్నలూ, పెద్దలూ ముసలాళ్ళూ ఉన్నారు. వాళ్ళకు పండగలొచ్చాయి పబ్బాలొచ్చాయి, కష్టాలొచ్చాయి, సుఖాలొచ్చాయి, విరహాలు, సంతోషాలు, రోగాలు, మృత్యువులు, కరువులు, కాటకాలు, పెళ్ళిళ్ళు వియోగాలు అన్ని అనుభవాలూ వచ్చివుంటాయి. ప్రత్యనుభవం పాట అయింది. మరి మానవ హృదయం ఎక్కడైనా ఎప్పటికైనా వస్తుతహా ఒక్కటే. తల్లీ పిల్లలూ, ప్రేయసీ ప్రియులూ, పేదవాళ్ళూ, యుద్ధ వీరులూ—ఎప్పటికప్పుడు పాడుకుంటూ తమ కార్యకలాపాల్లో పడిపోతూ వచ్చారు! ఈ పాటల్లో ఎంత జీవం ఉందంటే, నోటానోటా పడి, అంచెలమీద ప్రయాణం చేస్తూ వస్తూనే ఉన్నాయి గాని ఆరిపోవడం లేదు, ఇంకిపోవడం లేదు. మధ్యమధ్య ఎప్పటి కప్పుడు క్రొత్త క్రొత్తవి పుట్టుకుంటూ వస్తున్నాయి.

మన తెలుగు ప్రజలవీ అట్లాంటి పాటలున్నాయి. వాటిలో తల్లీ పిల్లల పాట లొక రకం. మళ్ళీ వాటిలో జోలపాటలు ఒకరకం. క్రిందటి వారం వాటిగురించి చదివారు. ఇప్పుడు పిల్లల ఆటల పాటలనుగూర్చి నాలుగుమాటలు.

ఈ ఆటల పాటలు మళ్ళీ రకరకాలు ఉన్నాయి. తల్లులు పిల్లల ఆటను గూర్చి పాడేవి, ఆడపిల్లలు పాడేవి, మొగపిల్లలు కొంచెం పెరిగిన పిల్లలు పాడేవి.

వీటిలో తల్లులు పాడేవి మహా చల్లగా తీయగా ఉంటాయి. మొట్టమొదటి పాట—

విద్దెం విద్దెం వాహాల విద్దెం
విద్దెం చేస్తే వెండి చెయ్యి
తప్పక చేస్తే తప్పెడి చెయ్యి
మళ్ళీ చేస్తే మానెడి చెయ్యి

ఈ పాటలో బిడ్డ పట్టి చంటిపాప. ప్రాకే పాపకు నిలబడ్డం నేర్పుతుంది తల్లి. మెరుస్తున్న కళ్ళతో చిరునవ్వుతో చాపిన చేతులతో తల్లీ బోసినోరు విప్పి కిలకిల నవ్వుతూ చిగురు మేనుతో బిడ్డ. యీ పాటలో సాక్షాత్కరిస్తారు.

తల్లి చల్ల చేసుకుంటుంది. పిల్లకూడా చేస్తానంటుంది. ఒక చిన్న స్తంభాన్ని నాటి ఒక చిన్న తాడూ కింద ఒక చిన్న లక్కపిడతా—పాట బహుశా తల్లే పాడుతుంది.

చల్ల చెయ్యి గొల్లభామ
సందిట దండలు కదిలేను
వెన్న చెయ్యి అమ్మాయీ
వెండి మురుగులు కదిలేను
పాలు తాగు అబ్బాయి
పమిడి మురుగులు కదిలేను

ఇంతలో చల్లచేసే బిడ్డ ఇసకలోకి నడిచి వెళ్ళి అక్కడ ఆడుకుంటుంది.

ఇసుకలో ఆరేటి కుసుమ సిరిబాల
అబాల పేరేమి అనవాలేమి
అనవాలు అంబరస పేరు బాలయ్య

అని పాపను గర్వంగా తల్లి హెచ్చరిస్తుంది.

పాప మరికొస్త పెరుగుతాడు. పక్క పక్కనే అతే పాప ముంగిటిదాకా నడుస్తాడు. అక్కడి నుంచి పందిరి దాకానూ, వాకిటి దాకానూ. తల్లి ఎలా సంతోషిస్తుందో వినండి. ఆమెకు మందిరం మనగడా మామిడితోటలా కనిపిస్తాయి.

ముత్తెముల బాలయ్య ముంగిటాడంగ
ముంగిలి మామిడంత ముసిరె చిలకాలు
పగడముల బాలయ్య పందిటాడంగ
పందు మామిడంత భ్రమసె చిలకాలు
వజ్రముల బాలయ్య వాకిటాడంగ
వట్టి మామిడంత వచ్చె చిలకాలు.

పాప పెరిగి అబ్బాయి అయేడు. ఇంటి పక్కన తోటలో తంగేటి చెట్టుకింద ఆడుకుందుకు వెడతాడు. చెట్టుకు కట్టిన ఉయ్యాలలో ఊగేందుకు వెడతాడు. తల్లి మనస్సు కొంచెం తల్లడిల్లుతుంది. కాని తన పనులకి అడ్డురాకుండా తానే అబ్బాయిని పంపిందేమో. అయినా భయపడుతుంది. అయినా నెమ్మది తెచ్చుకుంటుంది.

తంగేటి చెట్టుకే తూగు టుయ్యాల,
ఉయ్యాల పట్టుక ఊగె బాలయ్య
తంగేటి చెట్టుకింద వంగి ఆడవచ్చె
హంసల్లు కోయిల్లు అవి లక్షవేలు
చిలకల్లు పావురాలు శివలక్షవేలు
శ్రీరాము డుండంగ మనకేటి భయమే
హనుమంతు డుండంగ మనకేటి భయమే

పక్కవీధిలో ఉన్న పుట్టింటికి తల్లి అబ్బాయిని పంపిస్తుంది. తన తండ్రితో తన కొడుకు ఆడుకుంటాట్ట. తాతకి మనమడిమీద వల్లమాలిన ఇష్టం. తాతా మనవలు కలిసి ఎలా ఆడుకుంటారో భావించుకుంటుంది. ఈ దృశ్యం అబ్బాయి సాటి పిల్లలతో ఆడుతున్నప్పటి దృశ్యంకన్నా తల్లికి ఎక్కువ ఆనందం ఇస్తుంది. వాళ్ళతో ఆడకేవద్దు. తాతతోనే ఆడుకో అంటుంది. అప్పుడు సాటి పిల్లలు చిన్నబోతారుట. ఏమి గర్వం తల్లికి.

తాతగారి యింట్లో తానాడబోయె
తాతతో తానాడు తండ్రి అబ్బాయి
శ్రీ మద్దికాయల్లు శ్రీ అలాటాలు
చిలకల్లు ఏమాయెను చిన్నబోయేను
హంసల్లు ఏమాయెను హడలిపోయేను
హంసలతో ఏమంటు ఆడకే వొద్దు

శ్రీ మద్దికాయలు శ్రీ అలాటాలూ ఆటలు కాబోలు. ఇట్లాంటివి తల్లులు పాడే పాటలు ఎన్నో ఉన్నాయి.

ఇక్కడి నుంచి పిల్లలు ఇంకా పెరుగుతారు. ఇదివరకూ తల్లి నీడలోనే ఆడుతారు. ఇదివరకు పడకుండా, భయపడకుండా, తల్లి కొంగు వాళ్ళకు పెద్ద ప్రాపు. తల్లి చూపుమేర దాటరు. ఇప్పుడిప్పుడే అమ్మ అక్కర్లేకుండా యీడు జోడు సావాసాలు వచ్చిపడ్డాయి. తన అవసరం లేకుండా అబ్బాయి స్వతంత్రుడై క్రొత్త ఆటగాళ్ళతో పోయినప్పుడు తల్లి మొదట అసూయ పడుతుందో, బాధ పడుతుందో, పాపం కవి ఏం వ్రాస్తాడో: తెలుసునా?

కొండవాగులు చేతులవంటి తరంగాలెత్తుతూ చిరునవ్వులవంటి నురుగులు మెరిపిస్తూ నవ్వుల వంటి గలగలతో ముందుకు పోతూ ఉంటాయి. వెనక్కి ఒక్కసారైనా తిరిగి చూడవు కొండ గంభీరంగా నిశ్చలంగా అక్కడే ఉండి వాగులోనికి అవసరమైనప్పుడు అమృతం పంపిస్తూ అట్లాగే చూస్తూ నిలబడిపోయి ఉంటుందిట. కొండ తల్లి, తండ్రి. వాగులు బిడ్డలు.

ఇంటి ముందు వాకిట్లో అబ్బాయీ అమ్మాయీ ఇరుగు పొరుగుల పిల్లలతో ఆడుకుంటున్నారు. తలాకలా తిరుగుతూ ఉండే కొంచెం ముందుకు వంగి గుంపుగా నిలబడి ఒకరి గోర్లు ఒకరికి చూపించుకొంటూ.

చిప్పగోర్లు చిప్పగోర్లు సిపాయిగోర్లు
మా తాత గోర్లు ముడాప రాళ్లు

అని ఒకరికొకరు ఎకసక్కెలాడుకుంటున్నారు. ఇంతలో అబ్బాయి పైకిచూస్తాడు. ఆకాశంమీద తెల్ల కొంగులబారు క్రొంచి పార వేసిన మల్లెపువ్వు దండలాకనిపిస్తుంది. చటాలున చేతులు పైకెత్తి అంతకన్న పైకి సన్నని లేత గొంతునెత్తి-కొంగా-కొంగా నా పాత గోర్లు పుచ్చుకొని నీ కొత్త గోర్లు ఇయ్యి— అంటాడు. అప్పుడు అందరూ కలిసి కొంగల్ని అడుగుతారు. అడిగి మళ్ళీ గుంపులో కూడి

తలలు వంచుకొని వేలి గోళ్లు చూసుకుంటారు. ఎర్రని గోళ్ళమీద తెల్లని చిరు చంద్రవంకల్ని చూసుకొని కొంగ ఇచ్చిన వరానికి ఉబ్బిపోతారు.

తరవాత అబ్బాయిలూ అమ్మాయిలూ విడిపోతారు. రంగురంగుల చిన్న పరికిణీలు లేక పావడాలూ పైన చిట్టి రవికలూ లేక జుబ్బాలూ సగం చెక్కిళ్లమీద పాకుకుపోయిన కాటుక మచ్చలూ. ఊగే జూకాలూ, తూగే జడ కుచ్చులూ, పాటలకు పడిపోయే గంతులూ గంతులకు పడిపోయే గజ్జలవీ గాజులవీ రవళులూ—ఆడపిల్లలు నవ్వుచక్కిలాడుకుంటారు. వెనక్కి ముందుకీ ఒకరి చేతులమీద మరొకరి చేతులు తప్పెటలుగా వాయిస్తూ,—

చెమ్మచెక్క చారడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెట్టంగ
రత్నాల చెమ్మచెక్క రంగులెయ్యంగ
పగడాల చెమ్మచెక్క పందిరెయ్యంగ

అక్కడ అబ్బాయిల ఆటలు దాగుడు మూతలు. గోళీకాయలూ గోటీబిళ్ళలూ—వీటికి పాటలుండవు. ఇవి పాటలక్కరలేనంత పెంకి ఆటలు కావు. మళ్లీ ఇక్కడ అమ్మాయిలు జంటలుజంటలుగా విడిపోతారు. ఒకరికొకరు ఎదురుగా నిలబడతారు. కుడి చేత్తో కుడి చేతినీ ఎడమ చేత్తో ఎడమ చేతినీ పట్టుకుంటారు. ఒప్పులకుప్ప తిరుగుతారు. మొదట మెల్లగా తరవాత చురుకుగా మరికొంత దురుసుగా మరీ వడిగా వడివడిగా, చేతులు బిగియ పట్టుకొన్న బలంవల్ల వెనుకకు వెన్నులు విల్లులాగ విరిచి వలయంగా గిరగిరా రెండు ఇంద్ర ధనుస్సులు పెనవేసుకున్నట్లు అయిపోయి తిరుగుతూ,—

ఒప్పుల కుప్ప ఒయ్యారి భామ
సన్న బియ్యం చాయ పప్పు

అంటూ పాడతారు. అప్పుడు వాకిలి వాకిలి అంతా హోరుగాలిలో ఊగిపోయే పూల తలలతోటి వనంలాగ ఉంటుంది.

ఎండ వేళల పిల్లలు ఎగరకూడదు. గెంతకూడదు అమ్మ ఒప్పుకోదు. వాకిలి దాటి వీథుల్లోకి వాడల్లోకి పోకూడదు. అప్పుడు అబ్బాయి అమ్మాయీ కలిసి బొమ్మరిల్లు ఆట ఆడుకుంటారు. అమ్మాయి బొమ్మరిల్లు పేకలతోనూ చెక్కలతోనూ కడతానంటుంది. అబ్బాయి మన్నుతోనూ పుల్లలతోనూ కడతానంటాడు. ఏదో ఒక ఇల్లు కడతారు. ఒక్కొక్కప్పుడు ఆ యింటిమీద ఒక చిన్న బొమ్మను ఓరగా నిలబెట్టి ఆ యింటిని చెట్టుకింద యింటిని చేస్తారు. ఆ యింట్లో కొన్ని బొమ్మలు పెడతారు. చందనపు బొమ్మలూ, తాటాకు బొమ్మలూ, ఆడ బొమ్మకు చీర, రవికా బొట్టూ కాటుకా, నగలూ, నాగరాలూ పెడతారు. మగ బొమ్మకు పంచ, కండువా, మీసమూ. పెద్ద బొమ్మలు అమ్మా నాన్నా చిన్న బొమ్మలు అన్నా చెల్లీ. ఒక్కొక్కప్పుడు ఈ అమాయకపు సంసారంలోనికి బావా, మామా అత్తా, తాతా కూడా వస్తారు. ఈ బొమ్మరింటి చుట్టూ కూర్చొని తాము దినదినమూ వింటూ ఉన్న కష్టసుఖాలు ఆ బొమ్మల సంసారానికి అంటకట్టి హాయిగా తెలుగు బిడ్డలు ఎలా పాడుకుంటారో చూడండి.

చిట్టిచిట్టి ముత్యాలు
చెట్టూకిందా పోసి
పుట్టా మన్నూ తెచ్చి
బొమ్మరిల్లూ కట్టి
బొమ్మరింట్లో బిడ్డని కంటే
బిడ్డ తలకీ నూనె లేమూ
మామ తలకీ మడ్డీ లేమూ
నీ తలకీ నూనె లేదూ
నా తలకీ నెయ్యి లేమూ
అల్లా వారింటికీ చల్లకెడితే
అల్లవారి కుక్క భౌయ్యిమంటే
కాళ్ళ గజ్జెలు గావి ఘల్లుమంటే

అని పాడుతూ తుది చరణం వచ్చేటప్పటికి ఘల్లుమని గంతులెయ్యాలి. ఇంతలో అబ్బాయి వంకర టింకరగా చేసిన తాటాకుబొమ్మ చేతిలో ఆడిస్తూ చెల్లెల్నో అక్కనో ఎకసక్కెలాడుతూ పాడుతూ వస్తాడు. ఏమని?

ఆడతారీ బొమ్మ పాడతారీ బొమ్మ
నక్కేరు చెట్టుకింద బొక్కేరు బొమ్మ
తోలు ముక్క ఉన్న తైతెక్క బొమ్మ
బొమ్మా బొమ్మా బొమ్మా బొమ్మా

అప్పుడు అమ్మాయికి కోపంవచ్చి దూరంగా కూర్చుంటుంది. అబ్బాయి ఊరుకుంటాడా?

ఒంటిపిల్లి రాకా సాకచోట
ఇద్దరు ముగ్గురు ఒకచోట

అని చెప్తాడు. అందరూ కిలకిల నవ్వి మళ్ళీ కలుసుకుంటారు.

కాని కొంతె అబ్బాయికి కూడా బుద్ధివచ్చే ఆటలూ పాటలూ ఉన్నాయి. మగరాజుని కదా అని ఆటల్లో గోడా కొమ్మా ఎక్కి పడితే ఏమవుతుంది? కాలు విరుగుతుంది. అప్పుడు అమ్మాయి కనుక జాలివేస్తుంది. పాపం మందేస్తుంది.

కొండమీద వెండి గిన్నె
కొక్కిరాజు కాలు విరిగె
దానికేం మందు
వేపాకు చేదు
వెల్లుల్లి గడ్డ
నోరాయి బొట్టు
నూటొక్క ధార.

అని పాడుతూ అన్నకేసి ఓరగా చూస్తూ ఇకిలిస్తుంది.

ఎండవేళ అమ్మా బిడ్డలూ కలిసి ఆడే ఆట కాళ్ళ గజ్జ ఆట. సాగగా పిల్లలందరూ రెండు కాళ్ళూ చాపి కూర్చోడం పాటలో ఒక్కొక చరణం ఒక్కొక్క కాలికి చొప్పున పాడుతూ తుది చరణం ఏ కాలి మీదకి వస్తే ఆ కాలు ముడుచుకోటం. రెండు కాళ్లు ముడుచుకున్న వాళ్లు పండిపోవడం, కాలు మిగిలి పోయిన వాళ్లు దొంగ కావడం-ఇదీ ఆట. తల్లికి చాలా మంది పిల్లలు ఉంటే ఈ ఆట సరదాగా ఉంటుంది. ఒకరిద్దరు బిడ్డలున్న తల్లి ఆడుతుంటే అమ్మే అస్తమానం దొంగ అవుతుంది, తప్పదు.

కాళ్ళా గజ్జా
కంకాణమ్మా
వేగు చుక్కా
వెలగ మొగ్గా
మొగ్గ కాదు
మోటుకు నీరు
నీరూ కామా
నిమ్మా కాయ
కాయ కాదు
వాయింటి కూరా
కూరా కాదు
గుమ్మడి సెట్టి
సెట్టి కాదు
చేమల మట్టా
మట్టా కాదు
మామిడి పిందె
పిందే కాదు
పీకల మీసం
ఆటికి పం డరటిపం డమ్మన్న ముద్ద
ఏడూ జోడూ ఎయ్యాపరాలీ
కాలు దీసీ గట్టున పెట్టా.

కూర్చొని ఆడే ఆటల్లో గుడుగుడు గుంచం ఒకటి. దీనిలో అబ్బాయిదే పైచేయి. కొంచెం మోటాట.

గుడుగుడు కుంచం
గుండారాగం
పాముల పట్నం
పడగా రాగం
గూట్లో రూపాయి
నీ మొగుడు సిపాయి
కత్తెయ్యనా కొట్టెయ్యనా
వేన్నీళ్లా చన్నీళ్లా?

కత్తి అంటే వలకీనట్లు కొడతాడు. దెబ్బ అంటే గుద్దు గుద్దుతాడు. వేన్నీళ్ళంటే తొడ పాయసం పెడతాడు. చన్నీళ్ళంటే చల్లగా గిల్లుతాడు. మోటు వేషం. అన్నింటి కన్న అసహ్యం వేసేదేమిటో తెలుసునా? గూట్లో రూపాయి నీ మొగుడు సిపాయి అన్న మాటలు. ఎంచక్కా చంకలు ధాటిస్తూ చెల్లికేసి చూస్తూ అంటాడు. అప్పుడు అమ్మాయికి సిగ్గూ కోపాలు వస్తాయి.

కాని గచ్చకాయల ఆటల్లో అన్నమీద పగ తీర్చుకొంటుంది. తానేమో అయిదు గచ్చకాయలూ ఒక్క ఊపులో ఎగరేసి దూసేసి పట్టుకొంటుంది. వాడి చేతిలో రెండు మిగిలి పోతాయి. రెండెగిరి పోతాయి. ఈ గచ్చకాయల పాట మహా చురుగ్గా పాడుతుంది అమ్మాయి. పాటలో మాట ఆటా గచ్చకాయల మోతలూ కలిసిపోయిన సందడిలో ఆ మాటలు చాలా వింతరూపాలు పొందుతాయి.

ఒక్కా ఓ చెలిమీ
రెండూ రోకళ్ళూ
మూడూ ముచ్చిలకా
నాలుగు నందన్నా
ఐదుం చిటిగోలునూ
ఆరుం దారాలూ
ఏడన భేటీలూ
ఎనమన మనమందా
తొంబా తోమమ్మా
పాతిక పట్టెడా
పడమట గడిచిలుకా
కన్నీ రెండాగా
కాకీ కరకంచూ
పిచ్చికి బీరంచూ
అమ్మకు బొమ్మంమా
నీకు కుళ్లుగుడ్డా
నాకూ పట్టంచు.

"నీకూ కుళ్లు గుడ్డా" అంటే అన్నయ్య కన్న మాట. ఈ ఆటలో అన్నయ్య సున్న, పట్టి గాడిద.

ఇలాగ ఎన్ని ఆటల పాటలున్నాయి. ప్రొద్దుట, మధ్యాహ్నం, సాయంకాలంపాటేవి. పెళ్లిళ్లలో పిల్లలు చాలమంది చేరతారు. కనుక పెళ్ళి పందిరి క్రింద ఎన్నిరకాల ఆటలయినా ఆడతారు. పందిరి గాటాలలో ఒక్కొక్కటి ఒక్కొక్కరు పట్టుకుని, చల్లో అమ్మా చల్లో- అని ఆడే గొల్ల స్తంభాలఆట ముఖ్యమైనది. దీనికి పాటలేదు. రాత్రిళ్లు వెన్నెలవత్తి ఆట. దీనికి పాటలేదు. ఇక అట్లతద్దినాడు ఉదయం అలవి కావన్ని ఆటలు. తెల్లవారగట్ల లేవడం, లేవని వాళ్లు-వీధిలో అట్లతద్దోయ్ అని కేక విని అదరిపడి కూర్చోవడం, ఉల్లిపాయ పులుసూ అన్నమూ తినడం వీధిలోకి ఒక గెంతు గెంతడం గంతులూ అట్లతద్దోయ్ ఆరట్లోయ్, ముడి పప్పోయ్, మూడట్లోయ్ అని కేకవేయడం, ఆడబిడ్డ అమ్మాయిల గుంపులో చేరడం, మగ బిడ్డ అబ్బాయిల మూటంలో దూకడం ఇంత కన్నా తెనుగునాటి బిడ్డకు ఆనందమిచ్చే ఆటల వేళ లేదు. అబ్బాయిల ఆటలూ పాటలూ వేరు. కొన్ని పాటలలో కొంత ముదురు పాకం, మగ తనం, కరుకూ కనబడతాయి. ఈ చరణాలు మారుతూవస్తాయి పాడేటప్పుడు గుంపు చేరు కున్న స్థలాన్నిబట్టి.

ఇంతలో ఆడపిల్లల జట్టు ఒక పెద్ద ఇంటి ముంగిట చేరుతుంది. ఈ జట్టులో ఒక్కొక్క చిన్న అబ్బాయి కూడా నడుమ నడుమ ఉంటాడు జట్టంతా రెండు గుంపులు అవు తుంది. ఒక్కొక్క గుంపే పంక్తిలాగ పరుచు కుంటుంది. ఒక పంక్తి ఆడపెళ్లి వారిది, ఒకటి మగ పెళ్ళి వారిది.

మగపెళ్ళివారు ఒక అడుగు ముందుకు వేస్తారు. "బుజబుజ రేకుల పిల్లుందా? బుజ్జా రేకుల పిల్లుందా? సామీ దండం పిల్లుందా? స్వారాజ్య మొచ్చే పిల్లుందా" అని పాడుతూ అడుగుతారు. అడిగి వెనక్కి వెడతారు. ఆడ పెళ్ళివారు ఆ పాటతోనే పిల్లుంది అని కలిపి ముందుకు వచ్చి చెప్తారు. చెప్పి వెనక్కి వెడ తారు. అలాగే పిల్లకి ఎన్నేళ్లు అని, ఏంకట్నం ఇస్తారనీ, ఏం లాంఛనాలు తీరుస్తారనీ, ఏం నగలూ నాణ్యాలూ పెడతారనీ, పాటల్తోనే అడగటం జవాబు చెప్పడమూను చివర్ని మగ పెళ్ళివారు సంతృప్తి పడతారు. పిల్లని తెమ్మం టారు. అప్పుడాడు పెళ్ళివారేమంటారు?

చింతచెట్టూ కింద చెప్పుల్ని విడిచి
తాటిచెట్టూ కింద దండుగా విడిసి
తోటమ్మ పిల్ల నిస్తానంటే
దోచుకుపోం డక్కల్లారా
లోడుకుపోం డక్కల్లారా.

అంటారు.

మగపెళ్లి వారికి కష్టంగా ఉంటా యీ మాటలు.

దోచుకు పోయేటందుకు దొంగవారామా?
పారిపోయేటందుకు పగలవారామా
పంపరే మా యింటికి పెద్ద మరదళ్ని.

అంటారు. అప్పుడు అందరూ ప్రసన్ను లవు తారు.

పెళ్లి అవుతుంది.

పెళ్లి అయాక ఏముంది? మళ్ళీ అమ్మాయి మళ్ళీ తెనుగుతల్లి అయి జోలలు పాడుతుంది. అబ్బాయి పెద్ద పెద్ద రంగాల్లో పడి పెద్ద కోతి కొమ్మచ్చులూ, పెద్దచెడుగుళ్ళూ, పెద్ద ఉప్పట్లూ ఆడతాడు.

# నేను = నువ్వు = అతను

**హితశ్రీ**

హిమాలయాల నుంచి దిగి వచ్చి సిద్ధుడూ సింహాద్రీ కాలినడకతో భారతదేశంలో సంచారం చేస్తున్నారు. సిద్ధుడు సంకల్ప సిద్ధుడు. సర్వ విషయాలూ సాంగోపాంగంగా ఎరిగిన వాడు. సింహాద్రి అతని నమ్మిన మిత్రుడు, తోడు నీడ, సహవాసి.

సహజసంపద ఐన ప్రకృతి సౌందర్యాన్ని విస్ఫారిత నేత్రాలతో అవలోకిస్తూ కాలి నడకన సంచరిస్తున్న సిద్ధుడూ, సింహాద్రీ ఒక నదీ తీరానికి చేరుకున్నారు. తీరాన గల ఒక గుడిలో బస ఏర్పాటు చేసుకున్నారు. అన్నం వండుకుని భోజనంచేసి మళ్ళీ బయలుదేరాలి. సింహాద్రి సరదాగల మనిషి. ఈలోగా చుట్టుపక్కల ఉన్న అడవిలోకి వెళ్ళిరావాలనిపించిందతనికి. సింహాద్రి తత్వం తెలిసిన సిద్ధుడు "సరే" నన్నాడు.

సరదాగా తిరగటానికి వెడితే సింహాద్రి యిప్పుడూ ఊరికే తిరిగిరాడు. వింత విషయం ఏదో తెలుసుకు తీరాలి. పరుగుపరుగున వస్తున్న సింహాద్రిని చూసి ఏదో విశేషం ఉందని అప్పుడే అనుకున్నాడు సిద్ధుడు.

"గురువు గారూ"

"ఏమిటి?" అడిగాడు సిద్ధుడు చిరునవ్వుతో.

"ఒక చిన్న సందేహం."

"ఊఁ."

"అడవిలో ఓ చెట్టు బోదెమీద యెవరో కొన్ని అక్షరాలు చెక్కారు."

"అందులో వింతేముంది?"

"ఆ అక్షరాల అర్థం నాకు బోధపడలేదు."

"ఏమిటా అక్షరాలు?"

'నేను = నువ్వు = అతను.

ఇదే సూత్రం

విప్లవతత్వం'— ఈ వృత్తాంతం సవిస్తరంగా చెప్పండి."

సిద్ధుడు మందహాసం చేశాడు. సింహాద్రి శ్రద్ధగా కూర్చున్నాడు. తేజోవంతమైన కళ్ళని సిద్ధుడు ఆకాశం వైపుకి తిప్పాడు. ఆకళ్ళు ప్రసారంచేసే వెలుగు వైపు చూస్తూ, సింహాద్రి ఊకొడుతుండగా సిద్ధుడు చెబుతున్నాడు.

(కథా ప్రారంభము)

"సింహాద్రీ, భారతదేశంలో ప్రబలంగా ఉన్న దుర్భరమైన ఆర్థికపరిస్థితి నీకు తెలుసు. కాలేకడుపుతో పనిచేస్తున్న గుమాస్తాకి ఉన్నట్టుండి బతుకుమీద ఏవగింపు కలిగింది. రాసే కలం నేలమీదకొట్టి ఆఫీసునుంచి బయటపడి కాళ్లు తీసుకుపోయిన దారిని పోతున్నాడు. ఊరిబయటి కొచ్చేశాడు. రోడ్డుపక్క పొలంలో పని చేస్తున్న రైతు అతన్ని చూశాడు.

"ఏమండీ ఇవాళ ఆఫీసు లేదా ఏమిటి?"

గుమాస్తా నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు.

"ఉంది."

"సెలవు పెట్టారా?"

"ఊహుఁ."

"అయితే మరి..."

"ఏమిటి?"

"ఇటు వెడుతున్నా రెందుకు?" అనుమానంగా అడిగాడు రైతు.

"ఆఫీసుకి వెళ్లట మెందుకు?"

రైతుకు అర్థం కాలేదు.

"అంటే?"

"బతకటానికేనా?"

"అంతేగా, మరి"

"అది జరిగే పనిగా కనపడక పోతే?"

"మీరే అట్టా అంటే..."

"అందుకే ఇలా..."

"ఎక్కడికి?"

"ఎక్కడికో"

"అదేమిటి? మరి ఇంట్లో..."

"ఒంట్లో సత్తువ ఉన్నదాకా ప్రయత్నించాను. అంతే"

గుమస్తా నిర్లక్ష్యంగా ముందుకు సాగిపోయాడు. రైతు ఆలోచనలో పడ్డాడు. నిశ్చయించుకున్నాడు. కాడి అక్కడ పారేశాడు.

"గుమాస్తాగారూ" గట్టిగా పిలిచాడు. గుమస్తా వెనక్కి తిరిగాడు. రైతు గబగబా నడిచాడు.

"ఎందుకు?"

"నేనూ వొస్తున్నా."

"ఎక్కడికి?"

"ఎక్కడికో."

"ఎందుకూ?"

"మీ రెందుకూ?"

గుమాస్తా ఒక క్షణం రైతు ముఖంలోకి చూశాడు.

"అందుకేనా?"

"అవును."

ఇద్దరూ నడుస్తున్నారు. ఊరి కనుమాపు మేరదాకా వెళ్ళారు. ఒక శ్రామికుడు ఎండిన చెట్టును నరుకుతున్నాడు. రైతును పలకరించాడు.

"ఎక్కడికి?"

"ఏమో."

శ్రామికుడికి ఆశ్చర్యం వేసింది.

"అదేమిటి?" అడిగాడు.

"కాళ్లు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికి"

ఏదో జరిగిందనుకున్నాడు శ్రామికుడు.

"ఏమిటీ వేదాంతం?"

"అంతకంటె చేసేదేముంది?"

"పొలం పోతే?"

"పొలంలో ఏముంది?"

"ఇట్లా మాట్లాడుతున్నావు, ఏమయిందేమిటి?"

"పైరుకింది మట్టేగా మనది. పొరపాటు, అదీ మనది కాదు" వినిపించుకోకుండా అన్నాడా రైతు.

"అయితే?"

"డొక్కలాడని కాడికి రెక్కలాడటమెందుకు?"

"ఇంట్లో వాళ్లు?"

"తినున్నా ఒకటే, లేకపోయినా ఒకటే"

"మరి ఇకెందాకా?"

"ప్రాణం వుంటేదాకా."

"అరు" గుమాస్తాని చూపిస్తూ అడిగాడు శ్రామికుడు.

"అంతే"

శ్రామికుడు ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటా ఆలోచన?" రైతు అడిగాడు.

శ్రామికుడు గొడ్డలి కింద పారేశాడు.

"పద"

ముగ్గురూ బయలుదేరారు. నడిచి నడిచి అడవి చేరుకున్నారు చీకటి పడ్డది. అందరికీ అమితంగా ఆకలేస్తోంది.

"డొక్కలు డోలు వాయిస్తున్నయ్" అన్నాడు రైతు.

"అవంతేలే" అన్నాడు శ్రామికుడు.

"మామూలేగా. అలిసిపోయి అవే ఊరుకుంటాయిలే" అన్నాడు గుమాస్తా.

"ఒక్క చెట్టుకీ కాయ కనపడదేం ఖర్మం?" ఆకుల గుంపుల్లోంచి పడుతున్న వెన్నెలలో కాయలకోసం గాలిస్తున్నాడు రైతు.

"ఇవన్నీ మనుషులకి పనికిరాని చెట్లు."

"అదుగో, ఆ చిటారుకొమ్మని ఏవో కాయలున్నట్టున్నయ్" వెతికాడు శ్రామికుడు.

"అవెట్లా అందుతయ్?"

చెట్టు మొదలుచుట్టూ బొమ్మజెముడు పుట్ట! కాలు మోపి చెట్టెక్కటానికి వీల్లేదు.

"నాకో ఉపాయం తోస్తోంది." గుమాస్తా ఆలోచించాడు.

"ఏమిటది?"

"మనం ఒకళ్ళ బుజాలమీద ఒకళ్లు ఎక్కితే ఆ కాయల్ని అందుకోవచ్చు."

"చిన్నప్పుడు సర్కస్ ఫీట్లు గాని చేశావేమిటయ్యా?" రైతు నవ్వాడు.

"పైనించి పడితే కింద ముళ్ళ పొదలోకే. మరి బాగా ఆలోచించాలి".

"కానీండి, ఏంచేస్తాం? అడవిచెట్లమధ్య ఏ పొదచాటునో ఓ కాయలుకాసే చెట్టు కనిపిస్తేను ఆకలిలో ముళ్ళూ, గిళ్ళూ అడ్డురావు. కూచోవయ్యా రైతూ."

రైతు కాళ్లు ముడుచుకుని కూచున్నాడు. అతని బుజాలమీద శ్రామికుడూ, శ్రామికుడి బుజాలమీద గుమాస్తా కూచున్నారు, రైతు నెమ్మదిగా నుంచున్నాడు. శ్రామికుడు అతని బుజాలమీద నుంచున్నాడు. గుమాస్తా అతని బుజాలమీద నుంచుని కొమ్మ అందుకున్నాడు.

ఇంత శ్రమపడ్డా అక్కడ ఉన్నవి నాలుగు కాయలే.

ముగ్గురూ మూడు కాయలు తీసుకున్నారు. నాలుగో కాయ దగ్గిర పేచీ వచ్చింది. అది ఎవరు తీసుకోవట్టు? సహజంగా ఎవరు ఎక్కువ శ్రమ పడ్డారనే ప్రసక్తి వచ్చింది.

"ఇంత ఆలోచన అనవసరం. న్యాయ ప్రకారం అది నాకే రావాలి. పైనించి పడితే నా గతేమవుతుందో ఆలోచించారా? కింద ఉన్నవాళ్లు పడ్డా కాళ్లు విరగవు. ఏమంటారు? న్యాయమేనా?"

"గుమాస్తా గారూ, మీరు పడలేదంటే దానికి కారణం ఎవరు? నేను కొస్త, అట్టా, ఇట్టా అయితే మీరేమయి ఉండేవారు? కింద భుజాలమీద కాళ్లు మోపి నిలబట్టం అంటే మాటలనుకున్నారేమిటి? ఆ కాయ నాదే."

"మీరిద్దరూ తగ్గాల. భుజాలమీద ఇద్దర్నీ ఎక్కించుకు ఎముకలు విరగగొట్టుకున్న నాకే ఆ కాయ రావాల. ఎముకగూడు తొలిగితే నా గతేం కాను?"

"అసలు నేను లేకపోతే ఈ కాయలు కొయ్యటమే ఉండేది కాదుగా." గుమాస్తా ఒక పట్టాన కాయ వొదులుకోదల్చుకో లేదు.

"నేను లేకపోతే ఎట్టా కోసేవారేమిటి? అసలు కాయలు చూపించిందెవరు?"

"ఎక్కువ కష్టపడ్డది నేను" రైతుకి కోపం వొస్తోంది.

"జాగ్రత్తగా పట్టు నిలబెట్టింది నేను."

"ఎక్కువ సాహసం చేసింది నేను."

"ఇదిట్టా తెగేట్టు లేదులే" అన్నాడు రైతు కొంచెం దౌర్జన్యంగా.

"ఎట్టా తెగద్దేమిటి?" శ్రామికుడు తీసిపోలేదు.

"పోట్లాట ఎందుకు? న్యాయం చెబుతాను వినండి. దీన్ని మూడు సమభాగాలు చేద్దాం."

"ఆమాత్రం తెలివి నాకు లేకపోలేదు. భాగాలు సమంగా ఎట్టా తెలుస్తయ్? ఆదాలో చించండి. మాటవంగా కే సరా?"

"చూస్తావుగా" గుమాస్తా కాయ చేతిలోకి తీసుకున్నాడు. చేతుల్తో ఏవో కొలతలు వేశాడు. రైతుదగ్గిర బాకు తీసుకున్నాడు. కాయ మూడు భాగాలైంది.

"ఏంటి?"

"తస్సాదియ్యా, బలే సమంగా కోసే వయ్యా."

మూడుముక్కల బరువూ సుమారుగా తూచి రైతు ఆశ్చర్యపడ్డాడు.

"ఈ మాత్రం దానికి ఇంత రభసపడ్డాం. సరే, ఇక్కడెక్కడైనా నీళ్లు దొరుకుతా యేమో చూడాలి. ఇవి ఇప్పుడే తింటే దాహం వేస్తుంది."

"ఈ చెట్టెక్కి చూస్తాను."

రైతు దగ్గిరలో ఉన్న ఓ చెట్టెక్కి నాలుగు వైపులా పారచూశాడు. దూరంలో వెన్నెల్లో మెరుస్తూ వాగు ఒకటి కనిపించింది.

ముగ్గురూ వాగు చేరుకున్నారు. ఒడ్డు దగ్గిరగా పోతే నీళ్ళంతా బురదగా ఉన్నాయి.

"మధ్యలో ఆ రాళ్ళదగ్గిర నీళ్లు స్వచ్ఛంగా ఉన్నాయి" అన్నాడు గుమాస్తా.

"మీకు ఈతొచ్చేమిటి?"

"రాదు. నీకు?"

"ఉహుఁ."

"నాకొచ్చు" అన్నాడు శ్రామికుడు.

"మరి మాకు రెండు దొప్పల్తో నీళ్లు తెచ్చి ఇడతావా?"

"తేవొచ్చు."

"రెండు దొప్పలు చెయ్యగలవా, రైతూ?"

"అదెంత పని."

క్షణాలమీద రైతు రెండు దొప్పలు చేశాడు ఏవో ఆకుల్తో.

శ్రామికుడు వెంటనే వాళ్లని సందేహించాడు.

"ఏమిటి సందేహిస్తున్నావు?"

"ఈడ మొసళ్లుంటయ్యేమో?"

"ఉండవు లే."

"ఎట్టా తెల్సు?"

"ఆఁ. ఇక్కడెందుకుంటయ్?" ధీమాగా అన్నాడు రైతు.

"దిగేది నువ్వు కాదుగా."

"ఉండవయ్యా, అంటే."

"ఇక్కడ నీళ్లు లోతు లేవుగా ఇక్కడ ఉండవోయ్." గుమాస్తా హామీ ఇచ్చాడు.

"ఏమో."

"అయితే నువ్వనేదేమిటి?"

"ఇంత ధైర్యం చేసి, శ్రమ పడితే నాకేం వొస్తది?"

"నీ భావమేమిటో స్పష్టంగా చెప్పరాదూ?"

"మీ ఇద్దరికీ నీళ్లు తెచ్చిపెడితే, ఆ రెండు ముక్కలూ నాకిస్తారా?"

"ఇద్దరికీ ఈత రాదనేగా నువ్విట్లా బేరం చెయ్యటం. సరే తీసుకో. పారెయ్యండి గుమాస్తాగారూ."

"ఊరికే ఇస్తున్నారేంటి?"

శ్రామికుడు ఆ రెండు ముక్కలూ తీసుకుని పంచ చివర కట్టి నీళ్లలోకి నడిచాడు, ఎగగట్టిన పంచతో. వాగు మధ్యదాకా వెళ్లి నీళ్లు ముంచుతుంటే పంచ ఓ రాయికి తగిలి, చీకి ఉన్న ఆ గుడ్డ చిరిగి, అందులో కట్టి ఉన్న కాయా, ముక్కలూ నీళ్ల పాలయ్యాయి. వాటికోసం చేతులు చాచటం వ్యర్థం. ప్రవాహ వేగంతో అప్పటికే అవి చాలా దూరం కొట్టుకుపోయాయి. చేసేది లేక దోసిళ్లలో నీళ్లు ముంచుకుని శ్రామికుడు వొడ్డుకు చేరుకున్నాడు. నీళ్లు పడి పంచంతా తడిసి ముద్దయింది. అతని అవస్థ చూసి, రైతూ గుమస్తా నవ్వుతున్నారు. "దురాశ దుఃఖానికి చేటు అని ఊరికే అన్నారా మన వాళ్లు?" గుమస్తా ఊరుకోలేక అన్నాడు. శ్రామికుడికి కోపం వొచ్చింది. తమ భాగాల్లో చెరికాస్త వాళ్లు శ్రామికుడికిచ్చారు. ఆకలి బాధ ఎక్కువగా ఉండటంవల్ల అతను మారు మాట్లాడకుండా ఆ ముక్కలు తీసుకున్నాడు. ముగ్గురూ తినబోతుండగా వెనకనించి ఓ కర్కశమైన స్వరం వినిపించింది.

"ఈ కాయలు కోసిందెవరు?"

ముగ్గురూ ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశారు. ఒక పెద్ద గంభీరాకారుడు నిలబడి వున్నాడు.

"ఈ కాయలు కోసిందెవరు?" గంభీరంగా మళ్లీ అడిగాడు అతను అధికార స్వరంతో. ముగ్గురికీ మళ్ళీ ఓ సారి వొళ్లు జలదరించింది.

"ఈ అడవి ఎవరిదో తెలుసా?"

ఒక్కసారిగా ముగ్గురికీ రాక్షసుల కథలు జ్ఞాపకానికొచ్చాయి. మాట్లాడటానికి ఎవరికీ ధైర్యం చాలలేదు.

"మాట్లాడరేం? ఎవరయ్యా, నువ్వేనా?" రైతువైపు భీకరంగా చూశాడు అతను.

"కాదు" అప్రయత్నంగా అన్నాడు రైతు.

"ఎవరు, మరి?"

రైతు కళ్ళని గుమస్తా వైపు తిప్పాడు. గుమాస్తాకి ప్రాణం పైకే పోయింది. రైతు తనని అలా బయట పెడతాడని అతను ఏనాడూ అనుకోలేదు. నిజానికి కోసింది తనే అయినా, అది ముగ్గురి ప్రయత్నంవల్లా జరిగిందే కాని తన ఒక్కడివల్లా కాదు. అయినప్పుడు "ఏజన్సీ ఆఫీసర్ గారికి తెలిస్తే జరిమానా, జైలు శిక్షా పడాలి. మర్యాదగా అవి అక్కడ పడేసి వెళ్ళండి. ఇటువంటి పనెప్పుడూ చెయ్యకండి. చూస్తే మర్యాదస్తుల్లాగే ఉన్నారు."

ఆ వ్యక్తి కాయలతో సహా చెట్లలో కలిసిపోయ్యాడు. గుమాస్తా ప్రాణం కుదటపడ్డది. ఈ మాత్రం దానికి బయట పడ్డందుకు రైతుకి కొంచెం కష్టం వేసింది.

"మీరు నన్ను క్షమించాలి. ప్రయత్నపూర్వకంగా నేను మిమ్మల్ని బయట పెట్టలేదు. ఏమిటో అట్లా..."

"పరవాలేదులే, రైతూ. కాని జరిగిన సంగతులు చూస్తుంటే నాకో విషయం స్ఫురిస్తోంది."

"ఏమిటది?"

"మన కష్టాలకీ, దారిద్ర్యానికీ కారణం ఎవరో కాదు. మనమే."

"అంటే?"

"మనమీద, మన తోటివాళ్ళమీద మన కున్న దృక్పథానే మన అధోగతికి కారణం. పంచుకునే సమయంలో కాయలు కొయ్యటానికి నేను ఎక్కువ కారణమంటే నేను ఎక్కువ కారణమని పోట్లాడుకున్నాం. నిజానికి, ఆత్మపరీక్ష చేసుకుంటే, ఎవరూ ఎక్కువ కాదు. కాయలకోసం అంతా చేతులు చాపాం. కాని ఆపదలో ఎవరికి వాళ్ళమే వెనక్కి తగ్గాలని చూశాం. నావంతుకు నేను ఇది నామీదికి రాకుండా ఉంటె బావుంటుందని అనుకోక పోలేదు. ముగ్గురమూ ధైర్యంగా అతనికి జవాబు చెప్పలేకపోయాం. కాయలు కొయ్యటానికి నేనెంత కారణమో మీరిద్దరూ కూడా అంతే గదా, ముగ్గురం కలిసి ఆకలిబాధకి ఓర్వలేక

కోగామంటే, పరిస్థితులు సరిగా చెప్పగలిగితే, ఆ కోయలు మనకి దక్కి ఉండవచ్చు. అలా కాకుండా ఎవటికి వాళ్ళం తప్పించుకోవాలని చూశాం. మన ఇద్దరి అసహాయ స్థితి చూసి ఇంసాక శ్రామికుడు అన్యాయంగా మన దగ్గర నించి లాభం పొందాలని చూశాడు. కాని ఆ పరిస్థితిలో మనలో ఎవరం ఉన్నా అలాగే చేసేవాళ్ళమేమో ననిపిస్తోంది నాకు. స్వార్థం అంతగా మనలో కరుడుగట్టుకు పోయింది. "ఆయతలి వ్యక్తి దగ్గిర్నించి వీసం సాధ్యమైనంత ఎక్కువగా లాభం పొందాలి. మన దగ్గిర్నించి ఇతరుల వ్యక్తి సాధ్యమైనంత తక్కువగా లాభం పొందాలి! ఇదీ మనవారి వాంఛ; మనపనుల్లో అంతర్వాహినిగా ఉంటున్న కార్య కారణ సంబంధం మన స్వార్థంలో. నేనూ అంతే, నేనెంతో అతనూ అంతే నువ్వూ. అతనూ, నేనూ అందరం సరిసమానులం, కష్టనష్టాలు సరిసమానంగా అనుభవిద్దాం అని మనం తికరగా బుద్ధిగా ఏనాడైతే అనుకుని ఆచరణలో పెడతామో ఆనాడు ఆరోజునించే మనకు మంచి రోజులు ప్రారంభిస్తాయని ఘంటాపథంగా చెప్పవచ్చు."

రైతూ, శ్రామికుడూ విన్నారు. "నిజం" అన్నారు.

"అయితే ఒక సందేహం" అన్నాడు రైతు.

"ఏమిటి?"

"మనముగ్గురం అట్టాగే ఉంటాం అనుకోండి. ప్రపంచం సంగతి?"

"మన ముగ్గురం ప్రపంచంలోని వ్యక్తులమే కదా. మనం మానవాతీతులం కాదు. నిజమే. కాని ప్రయత్నిస్తే మనుషులు మారటానికి ఎంతో కాలం పట్టదు. అది అలవికాని పని కాదు."

"అయితే ఏం చేద్దాం?" శ్రామికుడు అడిగాడు.

"ప్రచారం."

"ప్రచారం చెయ్యటానికి ఇదేమీ కొత్త సంగతి కాదుగా."

"నిజమే. కాని కళ్ళముందు కనపడేదాన్ని మనవాళ్ళు చూడరు. చూసినా బద్ధకంతో కళ్ళు మూసుకుంటారు. నిరాశతో, నిస్పృహతో అసాధ్యం అనుకుని ఊరుకుంటారు."

"అయితే మళ్ళీ వెనక్కి పోదామంటారా?"

"అవును. ప్రచారం ప్రారంభిద్దాం."

"మనకి మైకులూ అవీ ఎవరిస్తారు?"

"మైకంటే గట్టిగా వినిపించేదేనా?"

"అవును."

"అయితే అవసక్కర్లేదు. నేనరచినానంటే ఊరు మొత్తం హోరు మోగాల. అయితే ఏమని అరవాలో నాకు తెలీదు."

"నేను చెబుతాగా" గుమాస్తా అన్నాడు.

"నేను గట్టిగా చెబితే మా రైతులు వింద నే వోళ్లు కాదు."

ముగ్గురూ లేచారు. దాదాపు అడవి చివర దాకా రావటంవల్ల ఆరాత్రి పక్క గ్రామంలో గడుపుదామని నిశ్చయించుకుని నడక సాగించారు. కొంత దూరంలో ఓ కారు కనిపించింది. దగ్గిరికి వొచ్చి చూస్తే అందులో మనుషులు ఎవరూ లేరు.

"గవర్నమెంటోళ్ళ బండల్లేవుంది" అన్నాడు శ్రామికుడు.

"ఎట్టా?" రైతు అడిగాడు.

"ఆ సింహాలూ, చక్రం గవర్నమెంటు ముద్రంటూ..."

"ఈ కారు చెడిపోయింది. ఈ బండ రాయికి కొట్టుకుంది" ముందునుంచి కారు పరీక్షిస్తూ గుమాస్తా అన్నాడు.

"మన దారిన మనం వెడదాం పదండి"

"బాగుపడుతుందేమో చూద్దాం. నాకు కారు విషయం కొంచెం తెలుసు. అయితే ఈ టింకరలు తియ్యాలి. చెయ్యి వేసుకుంటావా?" శ్రామికుణ్ణి చూస్తూ అన్నాడు గుమాస్తా. ఆ నిశీధిలో, నిశ్శబ్దంగా ఉన్న ఆ అడవిలో, సమ్మెట ధ్వనులు చెలరేగాయి.

కారు బాగుపడ్డది. డ్రైవింగ్ నేర్చుకున్న గుమాస్తా స్టీరింగ్ పట్టుకున్నాడు. మిగతా ఇద్దరూ ముందు సీటులో సర్దుకున్నారు. కారు స్టార్టయింది. మళ్ళీ వెనక్కి తమ పట్టణానికి ప్రయాణం అయారు ముగ్గురూ. కోయలు కోసిన చెట్టు వచ్చింది. కారు దపీమని ఆగింది.

"ఏం?" అడిగాడు రైతు.

"చాకు ఉందా?"

"ఊం. ఎందుకు?"

"ఓసారి ఇలా తే"

రైతు చాకు అందించాడు. అతనికేమీ అర్థం కాలేదు. గుమాస్తా కారుదిగి ఆ చెట్టు బోదె మీద ఇలా రాశాడు.

"నేను = నువ్వు = అతను
ఇదే సూత్రం
విప్లవ తత్త్వం."

"ఏమిటది?"

"చదువు."

చదివాడు రైతు. గ్రామికుడికి చదివి విని పించాడు.

"ఇది బోధివృక్షం" అన్నాడు గుమాస్తా.

మళ్లీ కారు స్టార్టయింది.

* * *

"సింహాద్రీ, ఇదే ఆ అక్షరాల రహస్యం, అర్థం, రాగల సాంఘిక, ఆర్థిక విప్లవాల మూల సూత్రం ఈ మంత్రం."

ప్రకాశవంతమైన సిద్ధుడి కళ్ళు చెమ్మగిల్లాయి. సింహాద్రి కాంతి ప్రసారంచేసే ఆ కళ్ల వైపు అలాగే చూస్తూ ఆలోచిస్తున్నాడు.



కథానిక

# పేర్ల ప్రణయ గాథ

ఇచ్ఛాపురపు జగన్నాథరావు

ఆ అమ్మాయి పేరు మోహనరావు కేమీ నచ్చలేదు. చిన్నప్పటినించీ అలాటి పేర్లంటే అతనికి చాలా చికాకు. ఇంకా మూడేళ్ళు రోజూ నాలుగైదుసార్లు లెక్చరర్ అటెండెన్స్ తీసుకొంటూంటే ఈ పేరు వినాలనే భావం మోహనరావుకి చాలా బాధ కలిగించింది.

"రమణమ్మ!"

"ప్రెజెంట్ సర్" నీరసంగా, తియ్యని కంఠం.

ఈ మాటలు ప్రతి రోజూ వినడం ఎలాగువని ఆలోచిస్తూ ఆనాడే కాలేజీలో చేరిన మోహనరావు అటెండెన్స్ పలికిన అమ్మాయి వైపు చూచాడు.

తెలుపూ యెరుపూ కాకుండా చక్కని వర్ణంలో, తీర్చిదిద్ది సౌష్ఠవయుతమైన అంగాల పొందికతో అందాలని చిందుతోన్నట్లు కనిపించింది ఆ అమ్మాయి మోహనరావుకి. నిజం చెప్పవలసివచ్చినా, రమణమ్మ చాలా అందగత్తె వని అంగీకరించక తప్పదు. కాలేజీ అబ్బాయిలకి అమ్మాయిల అందం గురించి మాటలాడుకోవడంలో తొందరా, అతిశయాలూ ఉన్న మోహనరావు దృష్టిలో రమణమ్మ చాలా న్యాయంగానే సుందరిగా కనిపించింది.

రెండు నిముషాలు తేరిబార చూచి మోహనరావు సంతృప్తిగా చిరునవ్వు ఒకటి పారేశాడు ఎవరూ చూడకుండా మూడేళ్లు కాస్త కళ్ళకి నిండు ఉంటుందికదా అని. కాని ముల్లు గుచ్చుకున్నట్లు ఆ పేరు మళ్ళా జ్ఞాపకం వచ్చింది.

"రమణమ్మ"

కాలేజీలో చదువుకునే అమ్మాయిలు ఇలాంటి పేర్లతో ఉంటారని మోహనరావు అనుకోలేదు ఆధునిక ప్రపంచంలో ఇన్ని వందల చక్కని నామధేయాలుండగా, ఈ పేరే దొరికిందా? ఏ పల్లెటూరిలోనో ఇల్లు తుడుచుకుంటూ, "నా పేరు - రమణమ్మ" అంటే బాగుంది కాని, అక్షణంగా కాలేజీలో చదువుకుంటూ ఈ పేరు ఏమిటి?

క్లాసు పూర్తయింది. అంతా వెళ్ళిపోతున్నారు. మోహనరావు అమ్మాయిల వెనకాల నడుస్తున్నాడు. వాళ్లు స్వేచ్ఛగా మాట్లాడుకుంటున్నారు.

"ఏమే రమణీ-నీ సర్టిఫికేట్ వచ్చిందా?"

మోహనరావు గుండె ఝల్లుమంది... రమణి ...రమణి... ఎంత కటువుగా ఉంది! అయినా, వీళ్ళంతా ఎంత త్వరగా ఒకళ్ళకొకళ్లు స్నేహితులైపోయారు! ఉదయం నించీ తనకొక్క

డైనా పలకరించిన పాపాన పోలేదు. ఆ మంచితనమూ, ఈ పేరులోని పటుత్వమూ మళ్లీ మోహనరావుని ఆలోచనలలోకి పంపాయి.

రోజులు గడుస్తోన్నకొద్దీ మోహనరావుకి రమణమ్మ సౌందర్యమూ, గాత్రమూ అన్నీ అభిమానపాత్రాలవుతున్నాయ్. రోజులు గడిచినకొద్దీ ఆమె పేరు అతనికి శరీరం అయిపోతోంది మరీమరీ.

అసలు మోహనరావు పూర్వగాథ వింటేనే కాని, అతనికి పేరులమీద ఎంత అభిమానమో బోధపడదు. చిన్నప్పుడు వాళ్ళ అమ్మానాన్నా అతనికి వెంకట సుబ్బారావు అని పేరు పెట్టారు. ఎలాగో సుబ్బారావు థర్డ్ ఫారంలోకి వచ్చేసరికి ఓ చిన్న సంఘటన జరిగింది. వెంకట సుబ్బారావు యొక్క అత్యంత ప్రియమిత్రుడొకాయన,నిండుక్లాసులో అతన్ని "ఒరే, సుబ్బా" అని పిలిచాడు. సిగ్గువేసి, వెంకట సుబ్బారావు పలకడం మానేశాడు. దాంతో ఊరుకోవచ్చా? అలా ఊరుకోక ఆ ప్రియమిత్రుడు "ఒరే వెంకట సుబ్బయ్యా" అని పిలిచాడు. క్లాసులో అందరూ వున్నారు. అక్కడినుండి అందరూ వాణ్ణి "వెంకట సుబ్బయ్యా, సుబ్బన్నా, సుబ్బా, సుబ్బడూ" అని పిలవడం మొదలెట్టారు. . .

వెంకట సుబ్బారావుకి చచ్చినంత పనయి, చంపేసేంత కోపం వచ్చి, కళ్ళనీళ్ళ పర్యంతం వచ్చి నిశ్చలవం మనుని కూర్చున్నాడు క్లాసులో.

ఇంతట్లో టీచర్ వచ్చి అటెండెన్స్ పిలుస్తున్నాడు...

"శ్యామల"

"కృష్ణారావు"

"వేణుగోపాలం"

"మురళీధర్"

"వెంకటసుబ్బ-సుబ్బారావు"

మళ్ళా క్లాసంతా గొల్లుమంది. అవమానం పట్టలేక వెంకట సుబ్బారావు ఇంటికి వెళ్ళి జరిగినదంతా నాన్నతో చెప్పి, తన పేరు మోహనరావుగా మారిస్తేనే గాని బడికి వెళ్ళనని అధికారయుతంగా తండ్రికి తెలియజేసి, ప్రాయోపవేశం చేసి కూర్చున్నాడు.

"ఇదేం విడ్డూరంరా!" అంది అమ్మ. "చిన్నప్పటి పేరెవరైనా మార్చుకుంటారా!"

"మార్చకపోతే నేనన్నం తినేదిలేదు."

"ఇదేం బుద్ధిరా!"

అంతా ముక్కుమీద వ్రేళ్ళు వేసుకున్నారు. కాని వెంకటసుబ్బారావు మాత్రం చలించకుండా మర్నాడు ఉదయంవరకూ అకుంఠిత దీక్షాయుతమైన ప్రాయోపవేశం చెయ్యడంతో వాళ్ళనాన్న హడలిపోయి, వాడిపేరు మోహనరావుగా మార్పించాడు పట్టుబట్టి.

ఇదీ వాడి పూర్వ పేరు గాథ.

* * *

ఒకనాడు మోహనరావు మ్యాటినీషో సినిమాకి వెళ్ళాడు. కొంచెం ఆలస్యంగా వెళ్ళడం చేత లోపల ఏమీ కనపడడంలేదు. తిన్నగా వెళ్ళి ఏదో కుర్చీలో కూర్చున్నాడు. కొంచెం సేపు పోయాక, కళ్లు లోపలి చీకటికి సర్దుకున్నాక చూసేసరికి సరిగా తన ముందువరసలో కాలేజీ అమ్మాయిలంతా కూర్చున్నారు.

మోహనరావు ధీరోదాత్తుడే గాని, ఈ అమ్మాయిలముందు తాను ఎందుకూ పనికిరాడని అతనికి తెలుసును. అందుచేతనే ఎలాగయినా వాళ్ళని పలకరిద్దామనే కోర్కెని బలవంతంగా అణచిపెట్టుకుని, మగవాళ్ళతో స్వేచ్ఛగా మాటలాడేంత నాగరికత వీళ్ళకి రాలేదని అనుకుని తృప్తిపడి ఊరుకున్నాడు.

కాని అమ్మాయిలేమీ ఊరుకోలేదు.

"వెంకట్రావెందుకే మన వెయిటింగ్ రూమ్ చుట్టూ అలా తిరుగుతున్నాడు ఊరికే పోజులు కొడుతూ?" అందొక అమ్మాయి ఇంటర్వెల్ అయిన తరుణంలోనే.

"వాడికో జబ్బులే...చాలామందికీ ఈజబ్బు పాకింది ఎదురుగా నిలబడి మాటలాడడం ఒక్కడికీ చేతగాదు. ఆ మోహనరా ఒకడు."

మోహనరావుకి చెంపకాయలు తగుల్తున్నట్లున్నాయి. కాని రమణమ్మ అందుకుని "అతనంత పోజులు వెయ్యడులే" అంది.

అమ్మాయిలంతా తొందరగా "ఓహో! రమణి అతన్ని వెనక వేసుకొస్తోంది" అని యొగతాళి చెయ్యడం మొదలెట్టారు. మోహనరావు ఇంక వాళ్ళ కళ్ళ పడితే పరువు దక్క

చని, మరో సీటుకి పోయి కూర్చున్నాడు. కాని, రమణమ్మకి తానంటే అభిమానం వుందని అతనికి ఆ వేళ తెలియడంతో మహానందం అనుభవించాడు.

బొటానిస్టులకి తెలియని గుణం ఒకటి వుంది ప్రేమ వృక్షానికి. ఆ వృక్షం చీకటిలోనూ, తిండి తక్కువయినా, యెదుగుతూంటుంది. ఈ ప్రేమలో పడడం మొదలెట్టకుండా ఉండాలి కాని, ఒక సారి పడ్డాక మరి తేరుకోవడం ఉండదు. ఒక్తి కమ్యూనిజం లాంటిది.

ఆనర్సు కోర్సు పూర్తయే లోపున మోహన రావు రమణమ్మతో సెమ్మదిగా పరిచయం చేసే కాడు. యథాశక్తి విరహం కూడా అనుభవించటం మొదలు పెట్టాడు.

అయితే, ఈ విరహంలో కొత్త పద్ధతి ఒకటి కనిపెట్టాడు. "రమణమ్మ" అనే విప రీత కఠోరశబ్దం రోజుకి కొన్ని వందలసార్లు అనుకోవడం ఆరోగ్యానికి మంచిది కాదు కనక, ఏ పేరుతో పిలచినా గులాబీ గులాబీయే కనక, మోహనరావు రమణమ్మకి తన అంతరంగంలో పద్మిని అని నామకరణం చేసుకుని, విరహం ప్రారంభించాడు.

ఓ మంచి ముహూర్తాన మోహనరావు ఇంక భరించలేక, పద్మినిని తమ వివాహ విషయమై ప్రస్తావించేందుకు తయారై వెళ్ళాడు. వెతకబోయిన తీగ కాళ్ళకి తగిలినట్లు రమణమ్మే ఆ ప్రసక్తి ఎత్తేసింది.

"మన పరీక్షలు ఇంక రెండు నెలల్లో అయిపోతాయి" అని ఉపోద్ఘాతం ప్రారంభించి, "మనం వివాహం చేసుకోక, ఇంక వీలులేదు" అని తేల్చేశాడు మిస్టర్ మోహన్.

ఆ అమ్మాయి అంగీకరించింది. కాని మోహన రావు ఆ సంగతికూడా అనేశాడు.

"నీకేమీ బాగులేదా పేరు... చక్కగా "పద్మిని" అని మార్చుకుంటే బాగుంటుంది పెళ్ళికిముందే."

ఈ కాలపు అమ్మాయిలని నమ్మడానికి వీల్లేదు. అంతదాకా అంత ప్రేమ చూపుతూన్న రమణమ్మకి అతనిమీద ఒక్కసారి కోపం వచ్చేసింది.

"నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తే నా పేరేదైతే నే నీకేం!" అంది. మోహనరావు తెల్లముఖం వేశాడు. బ్రతిమాలి అంగీకరింప జేద్దామని ప్రయత్నించాడు. లాభం లేక పోయింది. అంతటితో ఆ ఘట్టం పూర్తయినట్లు రమణమ్మ అతన్ని అక్కడే వదలిపెట్టి చివాలున ఇంటికి వెళ్ళిపోయింది.

* * *

ఈ సంఘటన జరిగిన కొద్దిరోజుల తరువాత మోహనరావు రమణమ్మని క్షమాపణ కోరుకున్నాడు. కాని, ఆ అమ్మాయి, ఒక షరతు మీద మాత్రం అతన్ని పెళ్ళాడుతానని అంది.

ఆ షరతుకి మోహనరావు అంగీకరించక తప్పలేదు. తరువాత కొద్దినెలల్లో వాళ్ళిద్దరూ వివాహం చేసుకున్నారు.

వెంకటసుబ్బారావుకి రమణమ్మకి దాంపత్యంలో యిప్పుడు లోటేమీ లేదు. కాని, తన మూడోఘారం కథ రమణమ్మ కెలాగ తెలిసిందో మాత్రం మోహనరావుకి అంటే వెంకటసుబ్బారావుకి నేటికీ తెలియలేదు.



అంతర్జాతీయ గ్రామీణ విజ్ఞాన వినిమయమార్గం నూతనంగా ఏర్పాటు చేయబడిన వ్యక్తి వినిమయం కార్యక్రమం రీత్యా భారతదేశం నుంచి ఇటీవల అమెరికా వెళ్ళిన ఒక కర్షకుని యాత్రకు ప్రత్యామ్నాయంగా భారతదేశంలో సంచారార్థం ఒక అమెరికా వార్తా పత్రికా సంపాదకుడు, ఒక అమెరికా కర్షకుడు విమానంలో న్యూయార్కు నుంచి బయలుదేరారు.

ఇండియాలో ఉత్తర ప్రదేశంలోని ఎటావా వాసియైన యువకర్షకుడు శ్రీ అమర్ సింగ్ కడచిన సెప్టెంబరు, అక్టోబరు నెలలలో అమెరికా వెళ్లి ఆరు వారాలు కెరోల్ (జార్జియా) గ్రామీణ ప్రాంతంలో కర్షకులతో కాలంగడిపారు. ఈయన రాకకు ప్రత్యామ్నాయంగానే పైనచెప్పిన ఇద్దరు ఇక్కడకు భారతదేశం వస్తున్నారు.

# "ప్రజా ప్రతినిధుల" ఎన్నిక

"సత్యాన్వేషి"

ఈనాడు అనేకమంది వివేకవంతులు రాజకీయ పార్టీలలోని లోపాలని గ్రహించ కలుగుతున్నారు. కాని వీరిలో చాలమందికి నూతన దృక్పథం లోపించినందున అసలు రాజకీయాలే హానికరమైనవనీ, అయితే రాజకీయాలు అవసరమైనందున అవి ఒక తప్పనిసరి కీడు అని ఆత్మసంతృప్తి చెందుతున్నారు. వీరు రాజకీయాలు తప్పనిసరి అనుకోవటంలో పొరపాటు యేమీ లేదు; కాని రాజకీయాలు తప్పనిసరి కీడు అనుకోవటంలోనే పొరపడుతున్నారు.

రాజకీయాలు తప్పనిసరిగా హానికరమై ఉండవలసిన పనిలేదు. ఆ రాజకీయాలు కీడో, మేలో అనటం వాటిని ఆచరణలో పెట్టే మనుషులపైనా, విధానాలపైనా ఆధారపడి ఉంటుంది. ప్రభుత్వాధికార సంపాదనే లక్ష్యంగాగల "అధికార రాజకీయాలు" కీడు కాక తప్పదు. సాంఘిక శ్రేయస్సే ఆశయంగాగల సాంఘిక రాజకీయాలు మేలు కాక పోవు. కాబట్టి మనం చేయవలసిన పని అధికార రాజకీయాలైన పార్టీ రాజకీయాలకు స్వస్తిచెప్పి సాంఘిక రాజకీయాలను ఆచరణలో పెట్టేందుకు తోడ్పడగల మార్గాలను అన్వేషించటం.

ఇందుకు రెండు పనులు ముఖ్యం: ఒకటి, ప్రజలకు తమ రాజకీయ, ఆర్థిక సమస్యలను; వాటికి తగిన పరిష్కార మార్గాలను అవగాహన చేసుకోగల విజ్ఞానం కలిగించటం. రెండవది, ప్రతి నియోజక వర్గంలోని వోటరులకు తమ అభ్యర్థి నియామకంలోను, యెన్నికలలోను పూర్తి స్వేచ్ఛ కలిగించటం; ప్రజలకు తమ ప్రతినిధిపై అజమాయిషీ అధికారం ఉండటమే గాక, అవసరమైతే అతనిని తొలిగించి మరొకరిని యెన్నుకొనే హక్కు యేర్పాటుచేయటం.

ప్రజలకు ఆర్థిక, రాజకీయ పరిజ్ఞానం వున్ననాడు వారిని రాజకీయ నాయకులు తేలికగా మోసగించజాలరని, కాబట్టి ప్రజలను ఈ విషయాలలో విద్యావంతులను చేయాలని అందరూ చెబుతున్నదే. కాని యిందుకు కృషిచేస్తున్నవారు మాత్రం తక్కువ. రాజకీయ పార్టీలు కేవలం వోట్లకోసం సాగించే ప్రచారం ప్రజలను విజ్ఞానవంతులను చేసేందుకు తోడ్పడకపోగా, వారి బుర్రలను దిమ్మెక్కించి అంతా అయోమయం చేస్తున్నది. అధికార కాంక్షతోగాక, సంఘ శ్రేయస్సు, ప్రజాస్వామ్య విధాన రక్షణ ఆశయాలుగా గలవారుమాత్రమే ఈపని చేయగలరు.

ఇక ప్రజలకు తమ ప్రతినిధులపై పూర్తి అజమాయిషీ అధికారం ఉండాలంటే కొన్ని యేర్పాటులు చేయాలి. ఏ నియోజక వర్గంలోని ఓటరులు ఆ నియోజక వర్గంలో ఒక సంఘంగా యేర్పడాలి. వీరు తమలో తాము సంప్రదించుకొని తమకు నమ్మకమున్న వ్యక్తిని అభ్యర్థిగా నిర్ణయించుకొని అతనే యెన్నికోబడేటట్లు చూడాలి. ఇదంతా యేకగ్రీవంగా జరగటం సాధ్యం కాకపోతే అధికసంఖ్యాకుల అభిప్రాయాన్ని అనుసరించి జరుపుకోవచ్చు. అభ్యర్థికి అతని నియోజక వర్గంలోని ప్రజలే ఆర్థిక సహాయం చేయాలి. ఎన్నికలకై అభ్యర్థి సొంతసొమ్ము ఖర్చుపెట్టుకో వలసిన అవసరం లేకుండా చేయాలి. ఇందువలన యోగ్యత గల వ్యక్తి బీదవాడైనప్పటికీ ప్రజాసేవ చేయగల అవకాశం లభించటం మాత్రమేగాక, అతడు లంచగొండి, అవినీతిపరుడు కాకుండా ఉండేందుకు తోడ్పడుతుంది.

ఈరోజుల యెన్నికలలో అభ్యర్థి కాగోరిన వారికి ఉండవలసిన ముఖ్య యోగ్యత ధనం కలిగి ఉండటమే అయిపోయింది. రాజకీయ పార్టీలు విరివిగా డబ్బు వెదజల్ల గలవారినే అభ్యర్థులుగా సెలెక్టు చేస్తున్నవి. ఒక్కొక్క అభ్యర్థి గెలుపొందేందుకు వేలకువేలు ఖర్చు పెడతాడు. తీరా గెలిచిన తరువాత యిదివరకు ఖర్చుపెట్టిన మొత్తం సంపాదించటమే ఆశయమై పోవటంలో ఆశ్చర్యం లేదు. తన పద

విని గాసుకొన్నట్లు భావిస్తాడే గాని తనకు ప్రజలు అప్పగించిన బాధ్యతగా భావించడు. కాబట్టి అభ్యర్థికి ఓటరుకే ఆర్థిక సహాయం చేయటం అవసరం. అసలు ఓటరులే అభ్యర్థిని నిర్ణయించుకున్నప్పుడు యెక్కువ ధనవ్యయం చేయవలసిన అవసరం కూడా ఉండదు.

ఇక ఓటరులకు తమ ప్రతినిధిని ఆధికసంఖ్యాకుల నిర్ణయానుసారం తొలగించే అధికారం రాజ్యాంగచట్టంలో పొందుపరచాలి. ఇది జరగనంత వరకు ఓటరులే తమ అభ్యర్థి నుండి ఒక విధమైన హామీని తీసుకోవాలి. ఇది న్యాయశాస్త్రరీత్యా చెల్లుబడి అయ్యే ఏర్పాటు చేసుకోవటం కష్టం కాదు ఈ విధంగా జరిగితే ప్రతినిధి తనమీద ప్రజలకు పూర్తి అజమాయిషీ అధికారం కలదన్న విషయం గుర్తు పెట్టుకొని ప్రజాభిప్రాయ ధిక్కరణకు సాహసించలేడు. అందువలన సామాన్యముగా అతనిని తొలగించవలసిన అవసరమే కలుగక పోవచ్చు. ఇది ఒకవిధమైన అంకుశంగా ఉపయోగపడుతుంది.

పైవిధముగా వివిధ నియోజకవర్గములనుండి రాజకీయపార్టీల ప్రమేయంలేకుండా ప్రతినిధులు యెన్నుకోబడితే వారు శాసనసభలో ఏదో ఒక పార్టీకిగాక నూటికి ప్రజలకే బాధ్యత వహించి వ్యవహరించవలసి ఉంటుంది. ప్రజల నిరంతర అజమాయిషీ ఉంటుంది కాబట్టి స్వార్థదృష్టిలో ముఠాలుగా యేర్పడే ప్రమాదం వుండదు.

శాసనసభలో అధిక సంఖ్యాకులైన ప్రతినిధులు ఒక కామన్ ప్రోగ్రామును కుదుర్చుకొని మంత్రివర్గమును యెన్నుకుని పరిపాలన సాగించగలరు. ఏ ప్రతినిధి అయినా ప్రజాశ్రేయస్సే లక్ష్యంగా పెట్టుకోవలసి ఉంటుంది. కాబట్టి యీ విధమైన కామన్ ప్రోగ్రామ్‌ను కుదుర్చుకోవటం సాధ్యమే.

పై పద్ధతివలన పార్టీ పద్ధతివలన కలిగే హాని తొలగించబడుతుంది. ప్రతి ప్రతినిధి యేదో ఒక పార్టీ క్రమశిక్షణకు బానిసై కేవలం చెయ్యియెత్తే యంత్రంగా కాక, స్వతంత్రంగా ప్రభుత్వ విధానాలలోని మంచి చెడ్డలను వివేకజ్ఞానంతో పరిశీలించ గలుగుతాడు. లోపాలను నిష్కర్షగా విమర్శించేందుకు, ఎచ్చట మంచి ఉన్నా బలపరచేటందుకు సంపూర్ణస్వేచ్ఛ కలిగిఉంటాడు. ఏ ప్రతినిధీ తన పార్టీ బలాధిక్యతను అండగా తీసుకొని, యితరుల అభిప్రాయాలను లక్ష్యం చేయకుండా ప్రజాకంటకంగా వ్యవహరించే అవకాశముండదు. ఇంతవరకు రాజకీయపార్టీల పరమై పోయిన ప్రజల సార్వభౌమాధికారం తిరిగి ప్రజలకు దక్కుతుంది.

నాలుగో, అయిదో సంవత్సరాల కొకసారి యేదో ఒక పార్టీకి ఓటువేసి, ఆ పార్టీ ప్రజాశ్రేయస్సుకు భిన్నంగా పరిపాలిస్తుంటే తిరిగి యెన్నికలు వచ్చేవరకు నిస్సహాయులై చూస్తూ ఉండవలసిన దుర్దశ తప్పుతుంది. ప్రజలు నిర్విఘ్నంగా ప్రభుత్వ కార్యకలాపాలను కంట్రోలు చేయగల పాటవం కలుగుతుంది. ఎన్నికల సమయంలో ఊదరపెట్టి అధికారం హస్తగతం చేసుకుంటే నాలుగైదు సంవత్సరాలు చిత్తంవచ్చినట్లు పాలించగలమన్న రాజకీయ నాయకుల దురాశ వదిలిపోతుంది. అధికార రాజకీయాలు నీళ్లుకారిపోతాయి. ప్రజలు క్రిందినుండి పునాది వేసి సుస్థిరమైన ప్రజాస్వామిక వ్యవస్థను నిర్మించగలుగుతారు.

ఈ పద్ధతిని ఆచరణలో పెట్టటంలో కొంత ప్రయాస లేకపోలేదు. అలాఅని కొట్టివేయటం తెలివితక్కువ. దీనికి ప్రత్యామ్నాయం నియంతృత్వాన్ని కావలించుకోవటమే. ప్రపంచమంతటా పార్లమెంటరీ డెమోక్రసీలోని లోపాలు వెల్లడై, దానిని సంస్కరించుకొని నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థను నిర్మించుకోవలసిన అవసరం తప్పనిసరి అయింది. మనం యింకా ఆ లోపభూయిష్ఠమైన పద్ధతినే అనుసరించ ప్రయత్నించటం అవివేకం. "పార్లమెంటరీ డెమోక్రాటిక్ రాజ్యాంగం మనదేశ పరిస్థితులకు అనువర్తింపచేయుతగింది కాదు. ఇక్కడ డెమోక్రసీ పనిచేయాలంటే ఒక నూతన విధానం కావాలి" అంటాడు యం.ఎన్.రాయ్.

# ప్రశ్నలూ జవాబులూ

వె. వి.

"బాబయ్యగారూ! ఏమిటో రైతుకూలీపార్టీ అంట! ఎయేయి పార్టీలనేకం ఉన్నాయిట. ఇవన్నీ అసలెందుకూ అంట, మన పెద్దోళ్లు పెట్టిన కాంగ్రెసుండగా!" అన్నాడు మా పెద్దకాపు నాగయ్య నాతోటి. నేను కిళ్లీ నముల్తూ, "నే నొకటి చెప్తాను వింటావూ" అన్నాను! "అలాగేనండి బాబయ్య" అన్నాడు.

నేను మన ఆంధ్ర రాజకీయాల్ని గురించి సంక్షిప్తంగా యిలా చెప్పాను, "ఒక చిన్న విషయం చూడు. ప్రజల్లో చాలా మందికి తెలుసున్న పార్టీలు కాంగ్రెసు. కమ్యూనిస్టు, వీలుంటే సోషలిస్టు. ఈ పార్టీలన్నీ కర్షకుల్నీ, కార్మికుల్నీ ఉద్ధరిస్తామని చెప్పేవే. కమ్యూనిస్టులు, దోపిడీవాంఛ్రమూ, గుండెగింఛ్రమూ అని యీ మధ్యనే మనం తెలుసుకున్నాము. వాళ్లు చెప్పడం ఎక్కువ. చేసేది సున్న. మనిషి ఒకటికి అయిదు ఎకరాలు పంచుతామన్నారు మాటల్లో! దానికొక నిర్దిష్ట పణాలిక ఏది? అని చెప్పబోతూండగా—

"బాబయ్యా మొన్న మనూరొచ్చిన కమ్యూనిస్టాయన ప్రజలు కాంగ్రెసు పోలీసు రాజ్యాన్ని దుంప నాశనం చేసి, కమ్యూనిస్టు రాజ్యాన్ని స్థాపించాలి: అన్నాడు కదండీ" అన్నాడు నాగయ్య.

"నాగయ్యా, వాళ్ళకి "పోలీసు రాజ్యం" "దాస్య శృంఖలాలు" "సవాలు చేస్తున్నాం" అన్నటువంటి ఊకొమ్మడి మాటలు పదిలేక పదిహేను వచ్చు. వాళ్లు రైతులందరికీ యేమని చెప్తున్నారో తెలుసా? పూరి గుడిసెలో ఉన్న వాణ్ణి వెంటనే పెద్దరాజాగారి మేడలో కూర్చొపెట్తాం...అంటున్నారు. వాళ్ళకొక ప్రణాళిక, పద్ధతి ఏమీ లేదు. కమ్యూనిస్టులలో కొంచెం చదువుకున్నవాళ్లు ఉంటే, వాళ్లు మార్క్సిజం, లెనినిజం, స్టాలినిజం, ఇంపీరియలిజం, ఫాసిజం, నాజిజం-అన్న "ఇజం" వాడ్తారు. వాళ్ళ రాజ్యంవస్తే, గొప్ప బీద భేదం ఉండదు సరికదా, మానవుడూ, మానవేతరుడూ అన్న భేదంకూడా ఉండదు. వాళ్లదంత విశాల దృష్టి" అని ముగించాను.

"సరే బాబయ్యా, మరి ప్రజలు ఏపార్టీకి ఓటు వెయ్యాలి? ఈ పార్టీ చెడ్డ. ఆ పార్టీ మంచి అని మాకెలా తెలుస్తుంది" అని ప్రశ్నించాడు నాగయ్య.

"అందుకే ఓటర్లందరూ విద్యావంతులు కావాలి. దానికే వయోజన విద్యా ప్రచారం సాగుతోంది. మీరంతా చదువుకుని ఉన్నట్టయితే, తప్పకుండా మంచి వారికే. అర్థం చేసుకుని ఓటుని ఇచ్చివుందురు" అన్నాను నేను.

"అయితే ప్రజాపార్టీ మంచిదంటారా? కాంగ్రెసు గొప్పదంటారా బాబయ్యా? కాంగ్రెసులో పండిత నెహ్రూలాంటి రాజకీయ వేత్తలున్నారు గదండీ" అన్నాడు నాగయ్య.

"నా ఉద్దేశ్యం అది కాదోయ్! నువ్వు అంతటితో ఆగిపోయావ్. కాంగ్రెసు చెడ్డ పార్టీ అన్నానా. కాంగ్రెసు ఆదర్శాలు గొప్పవే. విద్యావంతులైనటువంటి దాదాభాయ్ నౌరోజీ, సి. ఆర్. దాస్, ఫిరోజిషా మెహతాల వంటి మహాత్ములు దాన్ని స్థాపించారు.. మహాత్ములకు మహాత్ములైనటువంటి గాంధీజీ దాన్ని నడిపారు. తర్వాత ...ఇప్పుడు మహాత్ములంతా గతించారు.

"ఇప్పటి కాంగ్రెసో మరి! కాంగ్రెస వర్కర్లు అంతా స్వార్థం కోసం, వారు ఒకానొకప్పుడు నమ్మిన కాంగ్రెసు మూలసూత్రాలు సహితం వదిలారు. ఆంధ్రరాష్ట్రం పేరు చెప్పితే మండిపడతారు కాంగ్రెసు అధ్యక్షులు పండిట్జీ. "నాకు మంత్రి పదవి అక్కర్లేదు, నాకు ప్రజాసేవే పరమావధి. అందుకేగా నేను మంత్రి పదవి వదలివేసి, కాంగ్రెస్ కార్యదర్శి పదవికి వెళ్ళాను" అని అంటారు ప్రముఖ కాంగ్రెసు వాది, ఆరోగ్య శాఖామంత్రి అయిన శ్రీ కళా వారు. "ఆంధ్రులు దేనికీ తీసిపోరు. మద్రాసు

ఆంధ్రులకు సరైన ప్రాతినిధ్యం ఉండాలి" అని దెబ్బలాడ్తారు డాక్టరు సీతారామయ్యగారు. (పాపం! పూర్వం కాంగ్రెసు అధ్యక్షులు. జె. వి. పి. రిపోర్టులో మద్రాసు మీద హక్కులు ఆంధ్రులు వదలితేనే ఆంధ్ర రాష్ట్రం - అని చెప్పిన ఆంధ్ర భక్తులు)." అని ముగించేసరికి "అయితే బాబయ్యా! ఎవ్వరికీ తెలియని పార్టీ ఉంటే చూడండి బాబయ్యా, దానికి మనం అంతా ఓటు వేద్దాం! ఈ ఎలెక్షను గొడవలు, ఈ పార్టీ వ్యవహారాలు చూస్తూంటే, తల నొప్పి వస్తోంది" అన్నాడు నాగయ్య.

"ఆయితే సావధానంగా వినవోయ్: నువ్వూ, నేనూ స్థాపించాలా ఏమిటి—విశాలాంధ్ర సభాధ్యక్షులయిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు "ఆంధ్రా ఫ్రంట్" అన్న పార్టీ స్థాపించారు. ఆయన ఒకానొకకాలంలో శుద్ధ కాంగ్రెసువాది. అంటే ఇప్పుడు కాంగ్రెసుకి రాజీనామా యిచ్చారులే. "మేమంతా ప్రజాపార్టీ స్థాపిస్తున్నాం" అని శ్రీ ప్రకాశం గారనగానే—"వారంతా స్వార్థం కోసం కాంగ్రెసు నుండి విడిపోయారు; నేనలా సామాన్య విషయాలకోసం రాజీనామా ఇచ్చే వాణ్ణికాను" అన్నారు యీ కాళేశ్వరరావు గారే! ఆయన పార్టీకి ఓటు వేస్తే ఏం జరుగుతుందో తెలుసా!—ఎల్లుండికల్లా విశాలాంధ్ర రాష్ట్రం ఊడిపడుతుంది" అన్నాను నవ్వుతూ.

"ఏంటోనండి. ఎందుకొచ్చిన పార్టీ అంట. అసలు సరిగ్గా మాటయినా తిరగదు, ముద్దుగా ప్రజాపార్టీ అన్నారు బాగుంది.— అయినా ఏమిటీ పార్టీగొడవలు ... ఒక్క విషయం చెప్పండి—అయితే రేపు వచ్చే ఎన్నికల్లో కాంగ్రెసు గెలవదంటారా" అని ప్రశ్నించాడు.

"ఏమో ఎవరు చెప్పగలరు? బ్రిటిష్ ఎన్నికల్లో, కన్సర్వేటివ్ పక్షంవాళ్లు గెలుస్తారని, అధికారంలో ఉన్న లేబరు పార్టీ ఓడిపోతుందని ఎవరనుకున్నారు గనక? అందుచేత కాంగ్రెసు అధికారంలోకి వస్తుందా, రాదా, అని చెప్పటం కష్టం. ఆ పార్టీ అధికారంలోకి వచ్చినా, ప్రతిపక్షా లెక్కువగా ఉంటాయి..." అన్నాను.

"అయితే మనం ఓటు ఎవరికి వెయ్యాలి?" అన్నాడు నాగయ్య.

"పెద్ద ప్రశ్నే అడిగావు. ఇందాక నీకు చెప్పటం మరచిపోయాను. మన దేశంలో ముప్పైరెండు పార్టీలు ఎలెక్షన్లలో పాల్గొంటున్నాయి. పద్దెనిమిది కోట్లు జనాభా ఓటు చేస్తారు. రకరకాలుగా ఉంటాయి ఆ పార్టీల సిద్ధాంతాలు. ఉదాహరణకు, కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ ఉందనుకో. అది గాంధీజీ ఆశించిన సర్వోదయ సిద్ధాంతాలకే పని చేస్తుంది. దాని నిర్మాణ కార్యక్రమం మంచిదే! అందులో కృపాలనీ, పి. సి. ఘోష్, శ్రీ ప్రకాశంపంతులు, ఆదిత్యన్, కేలప్పన్ మొదలయిన దేశభక్తులున్నారు. అలా ప్రతి పార్టీ విశిష్టత నువ్వు గమనించి, నీలో నువ్వు తర్కించుకుని ఓటు వెయ్యాలి.

"ఆఖరుకు రంగాగారుకూడ కృషికార్ లోక్ పార్టీ (పేరుచూసి కంగారుపడకు!) స్థాపించారు. కాని ప్రజల్ని మోసపుచ్చేందుకు, దాని కనుబంధ సంస్థగా పనిచేస్తున్నా ఆంధ్రశాఖకు రైతు కూలీ ప్రజాపార్టీ అని పేరెట్టారు. కాని ప్రజలు అప్రమత్తులయి ఉంటారులే, ఏమంటావ?

"సరే సాయంత్రం కావస్తూంది. మనం అంతా ఈ పార్టీ రాజకీయాల్లోపడి మతులు పోగొట్టుకోకూడదు. వ్యక్తుల కెక్కువ ప్రాధాన్యం యివ్వాలనుకో. ఆ వ్యక్తి ఎటువంటివాడయి ఉండాలంటే. ( ) ఇదివరకు ప్రజాసేవకు తన జీవితాన్ని అంకితంచేసి ఉండాలి. (2) కుల జాత్యభిమానాలు లేకుండా, రాష్ట్రపరిపాలనలో సమర్థత కలిగివుండాలి. (3) ఆంధ్రరాష్ట్రం విషయంలో ఆందోళనచేస్తూ రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలమీద తీవ్ర ఒత్తిడి తీసుకునివచ్చి, అవసరమొస్తే రాష్ట్ర విషయంలో సత్యాగ్రహం చేసేందుకు సిద్ధపడాలి. (ఒకవేళ తన మాట చెల్లదని తోస్తే, తన ఎం ఎల్.ఏ పదవికి రాజీనామా ఇవ్వాలి) (4) గాంధీజీ చెప్పిన సర్వోదయ సిద్ధాంతాల ప్రకారం, సాంఘిక సేవలో తన జీవితాన్ని అర్పించేవాడై ఉండాలి. లేవోయి నాగయ్యా వెడదాం" అన్నాను.

(పేజీ 8 తరువాయి)

ఉంటుంది. పది కొంపలు తియ్యకుండా ఒక లక్షాధికారు కాడు. లక్షాధికార్లు హెచ్చిన కొద్దీ సహజంగా అవినీతి దామాషా ప్రకారం హెచ్చుతుంది. అవినీతి ఎంతగా పెరిగితే బాగుపడేవాళ్ళ సంఖ్య అంతగా పెరుగుతున్నదన్న మాట.

కాంగ్రెసును పడగొట్టటానికి ఎన్నికలలో పోటీచేస్తామని ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెబుతారు. అవినీతి తొలిగిస్తామంటారు, పంటలు పండిస్తామంటారు, భూములు పంచుతామంటారు, నిరుద్యోగం తొలగిస్తామంటారు. కాని వీరి వాగ్దానాలకు ఆధారమేమిటి? ఇటువంటి పనులు వీరెన్నడన్నా చేశారా? లేదు. వీరు ఏర్పాటుచేసే అభ్యర్థులనుగురించి మనకేం తెలుసు? ఏమీ తెలీదు. కాంగ్రెసు అభ్యర్థులనుగురించి మనకి సందేహంలేదు. వారు ఏం చెయ్యగలరో, ఏం చేశారో మనకు తెలుసు. అదేపని మళ్ళీ వారు చెయ్యగలరు. మీకు ఎవరు కావాలి? దొంగవ్యాపారస్తులు కావాలా? పన్ను లెగగొట్టేవాళ్ళు కావాలా? తమ రాజకీయ ప్రతిపక్షులను పోలీసులచేత కాల్పించేవాళ్ల కావాలా? తిండిదొంగలు కావాలా? పర్మిట్లు సొమ్ము చేసేవారు కావాలా? అన్ని రకాల అభ్యర్థులూ, అనుభవం ఉన్నవాళ్లు మనకు దొరుకుతారు. వారికే మనం వోట్లు పడవేసినట్లయితే గత నాలుగున్నర సంవత్సరాలలాగే మరొక అయిదు సంవత్సరాలు హాయిగా వెళ్ళిపోతాయి. అనుకోని పరిణామాలుండవు. ఆచరణకు అతీతంగా ఉండే గాంధీజీ సిద్ధాంతాలను గురించి అధికారకీర్త్యా ధర్మపన్నాలు వినవచ్చు. ఈ సౌకర్యాలన్నీ ఇంకొక ప్రభుత్వం మన కివ్వకపోవచ్చు.

పోనీ కాంగ్రెసుకు వోటివ్వ వద్దనే అనుకున్నా, ఇంకెవరికిచ్చేట్టూ? ఇటీవల కాంగ్రెసులోనుంచి చీలిన పార్టీలన్నీ కాంగ్రెసు రంగువే గదా? వీళ్ళకు వ్యక్తులతో తగాదాయే గాని కాంగ్రెసుతో కాదు గదా? రేపు కొత్త కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడితే వీరికి వాటితో తగాదా ఉంటుందని ఏమిటి?

పోనీ కమ్యూనిస్టు పార్టీకే వోటిద్దామంటే అందులో ఎన్ని చిక్కులున్నాయి! వాళ్లు ప్రజాభ్యుదయం కోసం పాటుపడతామంటారు కాని ప్రజలంటే ఏమిటో పాటు అంటే ఏమిటో పడటమంటే ఏమిటో నిర్వచించరారు. ప్రపంచశాంతి అంటారు; వారు "ప్రపంచ" అనేమాటను ఏ ఉద్దేశంతో వాడుతున్నారో మనకు తెలియనివ్వరు. అదీకాక వీరితో ఇంకొక చిక్కున్నది. రేపు ఎన్నికల్లో మనం వీరిని గెలవనిచ్చినట్లయితే వీరు రష్యాను ఇక్కడ అవతరింపజేయవచ్చు. అప్పుడు మన గతేమిటి? మనం కూడా అమెరికా ఆగ్రహానికి గురికావలసిందే గదా! అణువు బాంబులూ, హైడ్రోజన్ బాంబులూ మనమీద కూడా పడవలసిందే గదా! ఎందుకొచ్చిన పీడ? ఈ కమ్యూనిస్టులను దూరంగా ఉంచటమే మంచిది.

పోనీ సోషలిస్టులకు వోటిద్దామంటే వాళ్లు కాస్సేపు కాంగ్రెసువాళ్లల్లే మాట్లాడతారు, అంచేత కాంగ్రెసుకు కాదని వీరికి వోటివ్వటం అనవసరం; మరి కాస్సేపు వీళ్లు కమ్యూనిస్టుల్లే మాట్లాడతారు, అందుచేత వీళ్ళకు వోటివ్వటం ప్రమాదకరం.

హిందూమహాసభ అభ్యర్థులకు వోటివ్వటం కూడా అనవసరమే. హిందూ మతాభిమానులు కావలసినంతమంది కాంగ్రెసులోనే దొరుకుతారు. అటువంటి అభిమానాన్ని ప్రకటించుకోవటానికని పని పెట్టుకుని హిందూ మహాసభకు వోటువెయ్యనవసరంలేదు.

కులతత్వంద్వారా జాతి సాహిత్యమూ, ధనికవర్గాలను బలపరచటంద్వారా వర్గ రాహిత్యమూ, కాంగ్రెసు అధికారుల అవినీతిని గురించిన ఆరోపణలు చేసినవారిని వెళ్ళగొట్టటంద్వారా కాంగ్రెసు నైర్మల్యమూ, పోలీసు పరిపాలనద్వారా అహింసా, వనమహోత్సవాలద్వారా అధికాహారోత్పత్తీ, అమెరికా అడుగులకు మడుగులొత్తి రష్యాను అస్పృశ్యంగా చూడటంద్వారా అంతర్జాతీయ తాటస్థ్యమూ, వాగ్దాన భంగాలద్వారా జాతీయ సమైక్యతా సాధించగల పార్టీ ఇండియాలో నేగాదు ప్రపంచం మొత్తంమీద భారతీయ కాంగ్రెసు తప్ప మరొకటిలేదు. దానికి కాదని మరొకరికి మన వోటివ్వటం ఎంతమాత్రం భావ్యంకాదు.

# స్వతంత్ర అభ్యర్థులు

ఏ. యల్. నరసింహారావు

ప్రస్తుత పరిస్థితులలో రాజకీయ వాతావరణమంతా నానా కశ్మలం అయిపోయిందన్న సంగతిని విజ్ఞులు గుర్తిస్తున్నారు. పార్టీ రాజకీయాలు, గ్రూపు ముఠా రాజకీయాలుగా మారి వాతావరణాన్ని మరింత ఖరాబు చేస్తున్నవి. వ్యక్తి వ్యక్తిగా జీవించలేకపోతున్నాడు. ఏదో ఒక పార్టీకి తన తల తాకట్టు పెడితేనేగాని ఆ పార్టీ ముద్రపడదు. ఏదో ఒక పార్టీ ముద్ర పడితేనేగాని తనకు పుట్టగతులు లేవనే నిస్పృహలోకి దిగజారిపోతున్నారు. మన ప్రజలలో విద్య విజ్ఞానం లేకపోవడంచేత ఆత్మగౌరవంతోను, ఆత్మ విశ్వాసంతోను జీవించలేకపోతున్నారు. రాజకీయ రంగంలో దిగిన జాదగాళ్ళకు కూడా యీ ఆత్మ విశ్వాసం, ఆత్మగౌరవం లేకుండాపోతున్నవి.

పదవీ వ్యామోహం, స్వార్థం మొదలైనవి వీరిలో బాగా నాటుకొని పోయినవి. ప్రజా ప్రతినిధులను నిర్ణయించుకోడానికి జరిగే ఎన్నికలు స్వార్థపరులు, పదవీ వ్యామోహపరుల చేతుల్లో ఒక వినోదంగా పరిణమించాయి. ఈ పార్టీలో కొడితే ఆ పార్టీలోకి, ఆ పార్టీలో కొడితే మరో పార్టీలోకి ఇవన్నీ కాకపోతే స్వతంత్ర అభ్యర్థులు అవుతున్నారు అనేకమంది. అందువల్ల 'స్వతంత్ర అభ్యర్థులు' అనే దానికి అర్థం లేకుండాపోయింది. ఇది నిజంగా దురదృష్టం. అనేక పార్టీలు పోటీ చేస్తున్న చోట్ల కొందరు "స్వతంత్ర అభ్యర్థుల" మంటూ నిలుస్తున్నారు. వీరిలో అనేకమంది ఆ పార్టీ వారివద్ద కొంత డబ్బు, యీ పార్టీవారివద్ద కొంత డబ్బు మరో పార్టీవారివద్ద మరి కొంత డబ్బు—యీ విధంగా ఒకరికి తెలియకుండా మరొకరివద్ద డబ్బు, గుంజి ఎన్నికలను కూడా ఒక వ్యాపారం క్రింద దించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇలాంటివారిని ప్రజలు వేయి కండ్లతో కనిపెట్టి వుండాలి. వారికి గుణపాఠం నేర్పాలి.

శ్రీ కళా వెంకట్రావుగారు ఒక సభలో ప్రసంగిస్తూ "ఇకనుంచి ప్రజలు వ్యక్తులకు కాదు పార్టీలకు ఓటివ్వాలి" అన్నారు. ఈ అభిప్రాయాన్నే గౌ. శ్రీ గోపాలరెడ్డిగారు కూడా పాల్ఘాట్‌లో ఎన్నికల ప్రచారం ప్రారంభిస్తూ సెలవిచ్చారు. కాని యీ మంత్రులు, పార్టీలు పుట్టకముందే ప్రజలు పుట్టారనీ, మంత్రులు, గవర్నర్లు, పోలీసులు లేని రోజుల్లో కూడా ప్రజలు బ్రతికారని గ్రహిస్తే యెంత బాగుంటుంది! వ్యక్తులు ముందు పుట్టారుగాని పార్టీలు ముందు పుట్టలేదు. పదిమంది వ్యక్తుల కలయికవల్ల సంఘం ఏర్పడుతున్నది, పార్టీలు ఏర్పడుతున్నవి. వ్యక్తులు లేకుండా పార్టీలు లేవు. అందువల్ల వ్యక్తులకున్న ప్రాధాన్యం పార్టీకి లేదు. ఈనాడు ప్రజలు చూడవలసింది వ్యక్తులు మంచివారా కాదా అని కాని పార్టీ మంచిదా చెడ్డదా అని కాదు. కాంగ్రెసు ప్రభుత్వంలోకి రాకముందు, వచ్చిన తరువాత కూడా అనేక మంచి తీర్మానాలే చేసింది. కానివాటిని అమలు చేయలేదు. కారణం? వెంకట్రావుగారు, రెడ్డిగారు సమాధానం ఇవ్వాలి. ఈనాడు బ్రిటిషు ప్రభుత్వ హయాంలో కూడా లేని అవినీతి, లంచగొండితనం, బంధు ప్రీతి ప్రభుత్వ శాఖలలోనే కాకుండా అన్ని శాఖలలోను వ్యాపించిపోయింది. దీనిని యీ మంత్రులు కాదనగలరా? అంటే రుజువు చేయాలి. ఇది కేవలం కాంగ్రెసు పార్టీకి సంబంధించిన విషయమే కాదు. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా ఆశ్రిత పక్షపాతం తప్పదు. ఆ జాడ్యం పార్టీ రాజకీయాలలోనే ఉన్నది. ఈ విషయం దూరదృష్టితోను, విమర్శనా బుద్ధితోను, నిష్పాక్షికంగాను యెవరికివారు యోచించుకొంటే స్పష్టంగా తెలుస్తుంది. ఏ పార్టీ అయినా కొందరి సహాయంతోనే అధికారంలోకి వస్తుంది. ఆ సహాయ పడ్డవాళ్ళకు, అధికారంలోకి వచ్చిన పిమ్మట సహాయం చేయక

తప్పదు. లేకపోతే వాళ్లు ప్రతికూల పక్షంలో చేరి తమను అధికారంనుంచి దించవచ్చు. అందువల్ల వారి సహాయం తమకు లభించడం కోసం వారికి తోడ్పడటం జరుగుతుంది. ఇది పర్మిట్ల రూపేణ కావచ్చు, సిఫారసుల రూపంలో వుండవచ్చు, మరేవిధంగా నయినా కావచ్చు. కాని ఇది జరగక తప్పదు. ఇదే పార్టీ రాజకీయాలలో వున్న పెద్ద ప్రమాదం; లోపం కూడా.

పైగా ఏ పార్టీకి కూడా ప్రజలందరికీ ప్రాతినిధ్యం వహిస్తున్నానని చెప్పుకోనేందుకు తావుండదు. అధికారంలోకి వచ్చిన పార్టీ నిరంకుశంగా మైనారిటీ పార్టీలను అణగద్రొక్కడానికి పూనుకొంటుంది. ఇది ప్రజాస్వామ్యం కాజాలదు.

ప్రజలు చైతన్య పూరితులైతే పార్టీ విధానం దెబ్బతింటుంది. తమకు కావలసిన ప్రతినిధులను తామే నిర్ణయించుకోగలుగుతారు. అంతేగాని ఒక పార్టీ అభ్యర్థులను నిర్ణయించడం, వారికి ప్రజలు ఓటివ్వడం—ఇది ప్రజాస్వామ్యం సక్రమంగా పనిచేయడానికి ఉపకరించదు. ఈనాడు పార్టీలలో పార్టీలు ఢీకొంటూ ఏపార్టీకి ఆ పార్టీ తన స్వార్థానికి ప్రజలను ఉపయోగించుకోడానికి కృషిచేస్తున్నాయి. అన్ని పార్టీలలో దెబ్బతిన్నవాళ్ళు అసంతృప్తి కారణంగా నిస్పృహలో స్వతంత్ర అభ్యర్థులవుతున్నారు. వీరిలో అనేకమంది స్వార్థపూరితులు, పదవీ వ్యామోహపరులూ వున్నారు. కొన్ని పార్టీలు ఎన్నికల ఎత్తుకోసం కొందరిని స్వతంత్ర అభ్యర్థులనే పేరుతో నిలబెట్టడం కూడా జరుగుతున్నది.

స్వతంత్ర అభ్యర్థులను ఎక్కువగా గెలిపించాలన్నప్పుడు నా ఉద్దేశం ఇలాంటి స్వతంత్రులని కాదు. ఏ నియోజక వర్గంలోని ప్రజలు ఆ నియోజక వర్గంలో బహిరంగ సభల ద్వారా తమ ప్రతినిధిని సూచించాలి. అంటే వారి ఇష్టులు వారి అభిప్రాయంలో యోగ్యత కలవారు అయినవారు ఎన్నుకోబడతారు. అలాంటి ప్రతినిధులు స్వార్థం లేకుండా ప్రజా శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని కృషిచేయ కలుగుతారు. స్వతంత్రులు ఏ పార్టీకి చెందనివారు; ఏ ముఠాతో సంబంధంలేనివారు. వారికి ప్రజాశ్రేయస్సే లక్ష్యంగాని, పార్టీ శ్రేయసు కాదు. ఈనాటి ఎన్నికలలో ఇలాంటి వారికి అవకాశం కన్పించడంలేదు.

పత్రికలలో వెలువడిన వార్తల ప్రకారం కడపనుంచి మాత్రమే యీ వార్త వెలువడింది. అక్కడి విజ్ఞులు సమావేశమై శ్రీ యస్. సంజీవరెడ్డిగారిని తమ అభ్యర్థిగా నిలబెట్టడానికి నిర్ణయించుకొన్నారు. నా అభిప్రాయంలో ఇలాంటివారు స్వతంత్ర అభ్యర్థులు. అంతేకాని శ్రీ వి. వి. నరసయ్యగారు నవంబరు 23వ తేదీ "తెలుగు స్వతంత్ర"లో చెప్పినట్లు శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావుగారు గాని లేక శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు కాని స్వతంత్ర అభ్యర్థులు కాదు. వారు అవకాశవాదులు. స్థానిక పరిస్థితులను బట్టి యీ స్వతంత్ర అభ్యర్థులను నిర్ణయించుకోవాలి.

ఈ ఎన్నికలలో నిజమైన స్వతంత్ర అభ్యర్థులు పాల్గొనటం లేదు. ఇది విచారకరమైన విషయం. కాని అనేకమంది పార్టీ రాజకీయాల రభస గుర్తించ కలుగుతున్నారు. మరో అయిదు సంవత్సరాలకు జరగబోయే ఎన్నికలలో నిజమైన స్వతంత్ర అభ్యర్థులకే స్థానం వుంటుంది పరిస్థితులు ఆవైపుకు దారితీస్తున్నవి. ప్రస్తుత పరిస్థితులలో మనం చేయగలిగింది ఒక్కటే. ఆది పార్టీలతో నిమిత్తం లేకుండా ఎన్నికలలో పోటీచేస్తున్న అభ్యర్థులలో ఎవరు ఉత్తములో, నీతిమంతులో, సమర్థులో తెలుసుకొని ఓటివ్వడం. వారి పూర్వచరిత్రంతా పరిశీలించాలి. అంతకన్నా మరోమార్గం కనిపించడం లేదు. సాధ్యమైనంత వరకు ప్రతిచోట ఎన్నికల్లో పోటీచేస్తున్న అభ్యర్థుల నందరినీ పిలిచి ఒకే ప్లాట్‌ఫారంమీద మాట్లాడించడం చేయాలి. ఎవరి కార్యక్రమం వారు ప్రజల ముందు పెట్టాలి. ప్రజలముందుకు వచ్చి నోరు మెదపడం చేతకాని అసమర్థులు శాసనసభల్లో ఏం మాట్లాడగలుగుతారు? ప్రజలకు ఏంపనులు చేయకలుగుతారు? ఈ కార్యక్రమాన్ని ప్రతి నియోజక వర్గంలోను ప్రజలు అమలు జరిపితే యీ ఎన్నికలవల్ల కొన్ని సత్ఫలితాలు కలుగవచ్చు. ఈ అభ్యర్థుల గుట్టు కొంత బయటపడవచ్చు.

ఎన్నికల భూతం : పార్టీ దాసులు

# భక్తుల అగమ్యగోచరత్వం

యం. యస్. చలం

రాజకీయ పార్టీల కోలాహలం మిన్ను ముడుతోంది. ప్రచారకుల వాహన ఘోషకి ప్రజలు తమ రోగాల పాలయ్యే స్థితివరకు ప్రచారం సాగుతున్నది. ఏ అభ్యర్థి గెలిచినా ప్రజా శ్రేయస్సు కొరకు పాటుబడేవాడే కావటం వల్ల ప్రజలు ఆరోగ్య భంగానికి భీతిల్లే పనిలేదు.

ఎన్నికల ప్రచారానికి యెవరో ఒక పెద్ద నాయకుడు దిగటం, అతణ్ణి బాజాభజంత్రీలతో వూరేగించటం, అతడు పల్కించే చిలుక పలుకులకు తన్మయత్వం పొందటం, నాగరికతగా రూపొందింది. వీరపూజ పనికిరాదనే నాయకులే ప్రజలచేత వీర కొలుపు కొలిపించుకుంటున్నారు. దేవుణ్ణి వూరేగించటం అనాగరికంగా భావించే ప్రజలు సైతం రాజకీయ నాయకులను దేవుళ్లుగా వూరేగించేందుకు సిగ్గుపడటం లేదు. రాజకీయ నాయకులకు నీ రాజనం పట్టటమే రాజకీయ చైతన్యంగా వున్నది. ఈ రెండు వూరేగింపుల్లోనూ వున్న భేదం రూపంలో తప్ప గుణంలో పూజ్యం.

ఇక యీ రాజకీయ నాయకుల ఉపన్యాసాలు వింటూంటే — ప్రజలు వినోదం కొరకు సినిమాలకు యెగబడవలసిన పని లేదనిపిస్తుంది. పూర్వం రాజులు రాజ్యాలు యేలుతున్నప్పుడు రాజుల వినోదం కొరకు విదూషకులుండేవారట. కాలం మారి ప్రజలే రాజులుగా రాజ్యాలు యేలే యీ కాలాన ప్రజాప్రతినిధులే ప్రజలపాలిట విదూషకులయ్యారు! ఏ ఉపన్యాసకుని మాటలు విన్నా ఆత్మస్తుతి, పరనిందా జాలువారుతున్నవి. తన పార్టీవల్ల తప్ప అన్యపార్టీల వల్ల దేశం అధోగతి పాలవుతుందని యెవరికి వారే ప్రజలను భయపెడుతున్నారు. ఇతరులపై వుమ్మి వేయటంలో తమ నోళ్ళను యెంగిలి చేసుకుంటున్న సంగతి ఎవరూ గుర్తించటం లేదు ప్రతివారూ తమ జీవితాదర్శం ప్రజాసేవే నంటూ ముక్తకంఠాన ఘోషిస్తున్నారు. ఈ ఘోష వింటూంటే- ప్రజలను యెల్లకాలం సేవ చేయించుకునే దుస్థితిలో వుంచటమే వారి ఆదర్శమనిపిస్తుంది!

ఇంతమంది నాయకమ్మన్యులచేత వుద్ధరించబడవలసిన దుస్థితిలో వున్నందుకు ప్రజలుకూడా విచారించటం లేదు. ఎవరో ఒకరిచే వుద్ధరించబడాలనే తమ స్వార్థ కాంక్షకు సిగ్గుపడటం లేదు. తమను తామే వుద్ధరించుకోవాలనే జ్ఞానం ప్రజలకు దూరమైపోయింది. వారి నాయకులు కూడా ఆ రకమైన జ్ఞానం యిచ్చేందుకు తోడ్పడటం లేదు.

చాలా మంది నాయకులు ప్రజల ఆర్థిక దుస్థితికి కారణం, ధనంమీద కొద్ది మంది వ్యక్తులే అధిపతులు కావటంగా పేర్కొంటారు. ఆ ఆధిపత్యాన్ని తొలగించి ప్రజలను సర్వ సౌభాగ్యాల్లో ముంచి తేల్చేందుకు రాజకీయ ఆధిపత్యాన్ని తమకు సంక్రమింప చేయవలసినదిగా యాచిస్తారు. యావన్మందికీ సంబంధించిన ధనం కొద్దిమంది చేతుల్లో బంధించబడితే ప్రజలు ఆర్థిక దుస్థితికి లోనైనప్పుడు, యావన్మందికీ సంబంధించిన రాజకీయాధికారం కొద్దిమందికే (అయిదేళ్ళపాటే కావచ్చు) సంక్రమింపజేస్తే ప్రజలు రాజకీయ దుస్థితికి యెందుకు పాల్పడరు? తమ అభీష్టాలకు వ్యతిరేకంగా సంచరించే ప్రజాప్రతినిధిని తమ యిష్టం వచ్చినప్పుడు తొలగించుకునే హక్కు ప్రజలకు లేనప్పుడు ఆ ప్రతినిధి తన రాజకీయాధికారాన్ని దుర్వినియోగం చేయడనే హామీ యెక్కడ? అలా అయితే పరిపాలన సాగవద్దా? అని చేల ముఖంతో ప్రశ్నిస్తారు.

ఇండియా సర్వాధికారి అయిన నెహ్రూగారు "నీతికాములనూ, సమర్థులనూ, కాంగ్రెసు

అభ్యర్థులుగా నియమించాలంటూ యెలుగెత్తే సరికి కొంతమంది ధనవంతులకు సైతం కాంగ్రెస్ అభ్యర్థిత్వం లభించింది. ధనవంతులకంటే సమర్థులూ, నీతిపరులూ, ఎవరనే భావం కాంగ్రెస్ వారికి కలిగి వుండవచ్చు. కోట్లాది ప్రజలు కూడబెట్టలేని ధనాన్ని వారు కూడబెట్టిన సమర్థులు. ప్రజల విరాళాలతో నిమిత్తం లేకుండా తమ యెన్నిక ఖర్చును తామే భరించుకోగల సమర్థులు. మొన్నటివరకు కాంగ్రెసును ఎదిర్చి, ఆ కాంగ్రెస్‌లోనే స్థానం సంపాదించుకోగలిగిన లేదా ఆ కాంగ్రెసుకే తమలో స్థానం యివ్వగలిగిన రాజనీతి విశారదులు. నీతి విషయంలో కూడా ధనికులకంటే నీతిపరులెవ్వరు? డబ్బుకొరకు నీతిమాలిన పనులు చేసేందుకు వారేమీ పేదవాళ్లు కాదు. కాంగ్రెసుద్వారా పరిపాలనకు రావటంకూడా వారి నీతిని నిల్పుకొందుకే! తమ ధనాన్ని యథాతథంగా నిల్పుకొని లేదా పెంచుకొని తమ నీతిని నిలుపుకోవాలంటే అధికారంలోనికి వెళ్ళి అనువైన శాసనాలు నిర్మించుకోవలసి వుంది.

ఈ యెన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ అవలంబించే విధానంకూడా చిత్రంగానే వుంది. ఇంతవరకు ఏఏ రాజకీయపార్టీలు అభివృద్ధి నిరోధకమైనవని వారు ప్రచారంచేశారో, ఆ రాజకీయ పార్టీలతోనే చేతులు కలిపి కాంగ్రెసును ఓడించేందుకు నడుములు బిగించారు. బలమైన రాజకీయపక్షంగా వ్యవహరిస్తున్న కాంగ్రెసును ఏదోవిధంగా చిన్నాభిన్నం చేయటంద్వారా తమ ప్రాబల్యానికి మార్గం యేర్పడుతుందన్న నమ్మకం వారిని యీ స్థితికి తెచ్చివుంటుంది. అంతిమ విజయమే పరమాదర్శంగా భావించే కమ్యూనిస్టులు విజయసాధనకు అవలంబించే యేలాటి పద్ధతులైనా సమంజసంగానే భావిస్తారు. ప్రభుత్వానికి ప్రతిపక్షం లేకపోతే ఆ ప్రభుత్వం నియంతృత్వం చెలాయిస్తుందనే వాదనలో కమ్యూనిస్టు నియంతలకు కూడా విశ్వాసముంది! యీ వాదననుసరించే కమ్యూనిస్టులను ఓడించవలసిన బాధ్యతకూడా యేర్పడింది. యీనాడు కమ్యూనిజం ప్రపంచంలో సగంపైగా విస్తరించివుంది. దానికి ప్రతిగా మరొక అభ్యుదయకరమైన విధానం లేకపోతే ఒకే ఒక సిద్ధాంతం ప్రపంచాన్ని ఆవరించి నియంతృత్వంలో ముంచివేసే ప్రమాదం ఏర్పడింది.

ప్రభుత్వానికి ప్రతిపక్షం వుంటంవల్ల దేశకళ్యాణం జరుగుతుందని రాజకీయ వాదులు ప్రచారం చేస్తున్నారు. ఆలోచిస్తే యీ ప్రచారం కూడా యథార్థానికి దగ్గరలో వున్నదని అనుకొందుకు వీల్లేదు. వాస్తవానికి కాంగ్రెస్ ప్రభుత్వాలు యింతవరకు ప్రతిపక్షాలను యెదుర్కోక తప్పలేదు. అధికార కాంగ్రెస్ పార్టీలకు అనధికార కాంగ్రెస్ పార్టీలు ప్రతి పక్షాలుగానే వ్యవహరించినయ్. కాని అధికారంలో వున్న పార్టీలు తమ విధానాలు మార్చుకోలేదు సరికదా ప్రతికక్షులను ఎన్నివిధాల అణచాలో అన్నివిధాల అణిచాయి. ప్రతికక్షులుకూడా అధికారంలో వున్నవారిని అయినదానికీ, కానిదానికీ, చీల్చి చెండాడడమే పనిగా పెట్టుకున్నారు. ఈ పోరాటానికి ఫలితం ప్రజలు నలిగి చావటం! రేపు ప్రభుత్వానికి ప్రతిపక్షం యేర్పడినా ఒరిగేది కనుపించదు. ప్రభుత్వం మంచిపనులు చేయటం ప్రతిపక్షానికి సరిపడదు. తన మంచి పనులద్వారా ప్రభుత్వం శాశ్వతంగా తిష్ట వేసుకు కూర్చుంటే, ప్రతి పక్షంయొక్క అధికారదాహం చల్లారదు. ప్రభుత్వంయొక్క మంచిలోకూడా వీరు చెడ్డను చూడగలగాలి. తాము అధికారంలో వుంటే అంతకంటే మంచి చేయగలమని చెప్పాలి. లేదా ప్రభుత్వంచేత తప్పులు చేయించేందుకు అనువైన విధంగా ప్రవర్తించాలి. విప్లవాలద్వారా ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థను తల్లక్రిందులుచేసి ప్రజల్లో ప్రభుత్వంపై అసంతృప్తి కలిగించేందుకు కమ్యూనిస్టులు ప్రయత్నించటం మన మెరిగిన విషయమే.

ఈనాడు యెన్నికల పిశాచం తన అధికారదాహాన్ని చల్లార్చుకుందుకు నాల్కలు చాచి వుంది. ప్రజలు యీ భూతంవాత పడకుండా వుండేందుకు పార్టీ దాసులకు పట్టాభిషేకం చెయ్యక (దాసుడు యితరులను దాసులను చేసుకొందుకే అధికారం వాంఛిస్తాడు) ప్రజా శ్రేయస్సు లక్ష్యంగల సమర్థులైన స్వతంత్ర అభ్యర్థులను ఎన్నుకోవటం విధి అయివున్నది.

స్కెచ్

# గోతిలో గొంతుకలు

యాముజాల శంకరం

"వస్తున్నాం!" అంది ఆ చెట్టుక్రింద చేరిన మూకలో మూలనున్న మోలగొంతు.

"చావండి చస్తే శేం? దశావతారం ఎత్తిన కలిపురుషుని కత్తికి పదును లేదు. ఉంటే బీదల్ని దునుమాడితే, మనదేశం బీదదేశం కాకుండా భాగ్యవంతుల భోగాల కోటపట్టయ్యేది" అందొక గొంతు.

"ఎందుకోయ్? ఊరికే అరుస్తావ్! చావటమేం కష్టమయిన పనా! ఇట్టే చావచ్చు. చూడ రామా? మొన్న వెంకటేశ్వర్లు చచ్చాడు. వంద రూపాయల ఉద్యోగం చేసేవాడు. ముగ్గురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూ వాడికి. అంతా పదిహేను సంవత్సరాలలోపు వాళ్ళే. ఇంకేముంది? ఇంటి పైకప్పెగిరిపోయింది. తల్లి బిచ్చమెత్తి పోషిస్తూ ఉండేది. ఓరోజు కర్మంచాలక పిలూరురోడ్డుమీద లారీ క్రిందపడి చచ్చింది. ఈ రోడ్డులో నెలకొకడు చస్తూంటాడు. అందుకని ప్రజగాని ప్రభుత్వంగాని శ్రద్ధ తీసుకోదు. ఇంకేముంది చెట్టుకొకడు పుట్టకొకడయ్యారు. సంపాదించేవాడు మొదలే పోయాడు. అదిగాక సంపాదన సంసారానికే సరిపోయేది కాదు. విల్స్ ఏంచేసి చస్తాడు" అంది మరో గొంతు.

"ఇతే బిడ్డల్ని కనటం అనవసరమా?" అన్నాడు మరొకడు.

"శుద్ధ అనవసరం" అంటూ మొదలుపెట్టాడో ఆర్థిక శాస్త్రవేత్త.

"చూడండి - ఒకడో ఉద్యోగం చేస్తూ ఉంటాడు. వాడికి వచ్చేవి యాభైరూపాయిలు. వాడికి ఆరుగురో, ఏడుగురో సంతానం. వీళ్ళందరికి ఉద్యోగా లివ్వాలి ప్రభుత్వం. అంతే కాదు, వీళ్ళకు తలొక అయిదారుగురు పుట్టారనుకోండి. ఒక్క సంసారంలోనే యాభైమంది ఉద్యోగాలు కావాలంటే? ఎన్ని ఉద్యోగాలున్నాయి? అందుకనే సంతాన నిరోధం అమల్లో పెట్టాలి."

"ఐతే మా గతి చూడండి!" అందుకున్నాడో గుమాస్తా.

"నాకిచ్చేది నెలకరవై. చేసేది గాడిద చాకిరీ- తాలూకాఫీసులో. సంపాదించేది నేనొక్కణ్ణి. తినేందుకు పది మంది దాకా ఉన్నారు కొంపలో. నెలకు కనీసం 10 రోజులు ఒంటిపూట, నాలుగు రోజులు పస్తు ఉంటున్నామంటే నమ్మండి. ఇది యిలా ఉండగా కేపైనా రోగం రొష్టి వస్తే"

"అందుకనే సంవత్సరానికింత బోనసంటూ ఇమ్మన్నారు. దాచుకుంటే కష్ట సమయాల్లో అక్కరకు వస్తుంది" అన్నది మరో గొంతు.

గొంతు సవరించుకుంటూ నాయకుడు లేచాడు. అప్పటిదాకా అన్నీ వింటూ కూర్చున్నాడ.

"భయపడకండి! హెచ్చు కూలీ కోసం, లేకపోతే లాభాల్లో పాలు పంచమని పోరాడుదాం" అంటూ మొదలుపెట్టాడు. అంతలో—

"ఎందుకు నాయనా! బొత్తిగా బస్తీలోనే బ్రతకాలని, సినిమాలే చూడాలని. వింతలు వినోదాలే కావాలంటే యెలా నాయనా!" అన్నాడో పల్లెటూరివాడా దారినపోతూ.

"ఎందుకు బాబూ! అలా అన్నావ్?" అంటూ ఆమందిని చీల్చుకుంటూ వచ్చిందో గొంతు.

"ఎందుకా? పల్లెల్లో బోలెడంత భూమి సేద్యం చేయక బీడుగా పడివుంది. తలో నాగలి కట్టి తలో ఎకరం దున్నుకోకూడదూ! వ్యవసాయంమీద యెంత మందైనా పని చేయవచ్చు, పోషింపబడవచ్చు. నలుగురికి పెట్టవచ్చు; కడుపునిండా తినవచ్చు; పైగా ఆదా చెయ్యవచ్చు. మీరు గ్రహించుకోలేకపోతున్నారు కాని, నలుగురు నాలుగు పనులు చేస్తే కరువు యెక్కడుంటుంది నాయనా! కూలీలంటే చౌకగా చూడబడుతున్నారు ఎందుచేత? అంతా ఆ పనికే ఎగబడి, బస్తీ వదలలేక. ఎప్పుడైతే మీరు బస్తీ వదిలి పల్లెలను పట్టుతారో అప్పుడు రెంటికీ విలువ చేకూరుతుంది. దేశం

సస్యశ్యామల మవుతుంది. అంతేగాని మత భేదాలు, పార్టీ విభేదాలు, అన్యోన్య కలహాలు అంతర్యుద్ధాలు, అత్యాచారాలు ఎందుకు నాయనా! కాని ఒక్కటి. ఇలాంటివి పట్టణాల్లోనే గాని పల్లెల్లో పనికిరావు. ప్రాణానికే మోసం వస్తుంది. అక్కడ కష్టపడి పనిచేయాలి, పండించాలి; తినాలి. మీకు ఇష్ట్యా, వాకిట్యా లేవుగా! నాతో కొంతమంది రండి? మిగతా వారు కూలీ-నాలీ, ఉద్యోగం-సద్యోగం చేస్తూ, బోనసు కోసం, లాభాల్లో పాళ్ళకు దెబ్బలాడుతారు. అప్పుడు రెండు విధాలా మంచిది."

"అమ్మో! వ్యవసాయమే! రాత్రింబవళ్లు కష్టపడాలి" అన్నదో గొంతు.

"ఉండవయ్యా! మధ్యన నీదో పిడకల నాటకం. ఇప్పుడు మేమేం మీ పల్లెల గురించి మీ వ్యవసాయం గురించి మాట్లాడ్డం లేదుగా నువ్వు కొత్త ఆ ఉపన్యాసం వింటుంటూ ఉంటే ధన్యుడివి" అన్నది గ [illegible].

ఇలా ఒకవాని తరువాత మరొకటి లేచాయి. అంతా అతని మాట పెడచెవిని పెట్టారు. ఆ గుంపులో నిల్వలేక పోయాడతను. చిరాకెచ్చింది. ఛీ! అనుకున్నాడు. ఎక్కడా దారి పట్టాడు పోదామని.

"ఏం బాబూ! నీమాట ఎవరి చెవికెక్కింది? వాళ్లు రోజుకు ఎనిమిది గంటలు పనేమిటి రెండు గంటలే చేస్తామనే రకం. రాత్రింబవళ్లు కష్టపడి వ్యవసాయం చేసే దీక్ష, శ్రద్ధ, ఓపిక వారికేదీ?" అంటూ మూలనున్న [illegible]నుడు ముందుకొస్తూ, పల్లెవానితో ప్రసంగించాడు.

"అంతేనా?" అన్నాడాశ్చర్యంగా.

"కాక! వీళ్లు ప్రొద్దున్నే లేచి, రెండు ఝాములదాకా నాగలి దున్ని, ఆపైన ఎడ్లను సాయంత్రం దాకా కాచి, గొల్లవాళ్లూ పొలం కాస్తూ ఉండగలరా! దెబ్బకి చావరూ! వీళ్ళేం వ్యవసాయం చేస్తారు. విందులు వినోదాల కలవాటుపడ్డ దేహాలు పుట్టి పనిచేయగలవా?"

"ఐతే వీళ్ళంతా ఎందుకు చేరారిక్కడ?"

"ఏదో సమావేశమట. ఆ పెద్ద మనిషి నిలమన్నాడు మాచాప్కి అతను [illegible] నాయకుడు. అప్పుడప్పుడు వచ్చి ఇలాంటి సమావేశాలు జరుపుతూ ఉంటాడు. ఎందుకో? పలుకుబడి సంపాదించుకునేందుకు. రేపు వోట్లు వేయించుకునేందుకు. అంతేగాని మాకేం ఒరిగి ఒళ్లో బడదు.

"సుందరరామూ! సమానత్వం, సౌభ్రాతృత్వమంటూ అరుస్తున్నాడు! అతనికి ఓ యాభై ఎకరాల పొలముంది. మామిడిపళ్లు పండుతాయి. తనకోసం పది పుట్లు ఉంచుకొని కడమవి మామూలు ధరకు మాకివ్వకూడదూ! ఎందుకివ్వడా? ఎందుకిస్తాడు? వాళ్ళకో ఆవుందనుకో పాలు పెరుగు అమ్మటమే కాదు, దాని పేడను మట్టిలో కలిపి పిడకలు చేసి అమ్ముతారు వాళ్ళ ఆడవాళ్లు. ఇక మనకు బియ్యం సరయిన ధర కిస్తాడా! వీళ్లు మాకు నాయకులు.

"ఇటు మాకు సగా లుండకూడదంటాడు. ఆయనే సన్యాసుల కూడగొట్టాడు. ఇది వాడు ముస్లిం హిందువుల తగవులాట లేదనుకుంటు గాని ఇప్పుడు-హిందువుల్లో హిందువులు కొట్లాడుకుంటున్నారు. ఒకరిమాటఒకరికినచ్చదు. మత విశ్వాసాలు, బ్రాహ్మణ బ్రాహ్మణేతర కీచులాటలు. ఇలా ఉంటే మన ఆంధ్రదేశం ముందుకు పోవాలంటూ డాయన ఎలా పోతుంది? మొట్టమొదట యీ హెచ్చుతగ్గులు సరిదిద్దమను. అసలు మతాలు మారిపోవాలని ఎవడేడిశాడు? ఇదంతా వీళ్లు కల్పించిందే. ఏదోవిధంగా పైకి రావాలని. మంత్రిపదవి అలంకరించాలని. ఆయన మాటమాటకీ మాకే అంటాడుగదా ఏదీ నన్ను పంక్తిని కూర్చోబెట్టుకొని ఇంట్లో అన్నం తినమను. లేదా, ఆయన పిల్లను మా అబ్బాయికిమ్మను. అలా కాదు. ఆయన చెప్పినట్లల్లా మేం నడుచుకోవాలి. అవన్నీ ఆచరణలో పెట్టాలి. ఆయనకు మాత్రం ఇవి వర్తించవు. ఏదో తామరాకు మీది నీటిబిందువులా, అంటీ ముట్టకుండా నాల్గు ముక్కలు చెప్పిపోతాడు. తెలియనివాళ్ళంతా నమ్ముతారు. ఇదీ ప్రపంచం.

"పద! మనం పోదాం! ఆ గోతిలో పడ్డ గొంతుల్ని ఎలాగే గింజుకోనీయ్! వీళ్ళేం మంచి చెబితే వికారం కాదు. గస్తీలో ఉండటం, సుఖాలనుభవించటం, దానికి ప్రజాసమూహం దోహదమివ్వటం, ఇదీ కావాలి!"

అంటూ ఆ ఇద్దరూ, అస్తమిత సూర్యకిరణాలు ముఖమ్మీద నాట్యం చేస్తూండగా, పశ్చిమదిశగా సాగిపోయినారు.

Edited Printed and Published by KHASA SUBBA RAU, at *Swatantra Printers,*
160, Lloyds Road, Royapettah, Madras.

# తెలుగు స్వతంత్ర

| | | | | |
|---|---|---|---|---|
| సాలు చందా | ... | ... | రూ. | 12-0-0 |
| అర్థ సం॥ చందా | ... | ... | రూ. | 6-0-0 |

## విడిప్రతి నాల్గణాలు

అర్థ సంవత్సరముకంటె తక్కువ కాలమునకు చందా అంగీకరింపబడదు.

## ప్రకటన రేట్లు

కాంట్రాక్టు :

(సాలుకు 24 లేక అంతకు మించినపర్యాయములు ప్రకటించువారికి కంట్రాక్టు రేట్లు వర్తిస్తవి)

| | | | | |
|---|---|---|---|---|
| పూర్తి పేజీ | తడవకు | ... | రూ. | 80-0-0 |
| అర పేజీ | ,, | ... | రూ. | 45-0-0 |

క్యాజువల్ ప్రకటనలు :

| | | | | |
|---|---|---|---|---|
| పూర్తి పేజీ | తడవకు | ... | రూ. | 90-0-0 |
| అర పేజీ | ,, | ... | రూ. | 50-0-0 |

## కవరు పేజీల రేట్లు ప్రత్యేకము

మిగతా వివరములకు వ్రాయండి :

## తెలుగు స్వతంత్ర

160, లాయిడ్స్ రోడ్డు, రాయపేట మద్రాస్-14.